శ్రీరస్తు.

# భక్తరామదాసు.



( హరికథ )

గ్రంథకర్త

"బాలభాగవతర్"

పి. ఎ. వి. ఎల్. ఎన్. ఎస్. దీక్షితదాసు.

మొదట కూర్పు 1000.

నర్సాపురం.

1935.

[ కాపీరైట్సు ] [ వెల 0—8—0. ]

శ్రీ రాజగోపాలపరబ్రహ్మణే నమః.

ఉ॥ దాతలు, మిత్రసత్తము, లుదారచరిత్రులు, మద్ధితార్ధ లీ
రీతిని రామదాసుచరిత్రము ముద్రణముం బొనర్పఁజే
యూతగ ద్రవ్యదానమిడి యూర్జితపుణ్యులు, తత్పవిత్రవి
ఖ్యాతుల దివ్యనామములఁ గాంచుఁడిదే వివరింతునిర్వ్యడన్.

| | | |
|---|---|---|
| శ్రీయుత కాచీభట్ల నరశింహంగారు | సోంపల్లె | 8—0—0 |
| డాక్టరు. టి. విశ్వనాథంగారు L. M. P. | పెనుగొండ | 12—0—0 |
| జవ్వాది అత్మయ్యనాయుడుగారు | పెనుగొండ | 10—0—0 |
| మాచిరాజు సుబ్బారావుగారు | సోంపల్లె | 4—0—0 |
| పొన్నాడ సత్యనారాయణమూర్తిగారు | సోంపల్లె | 2—0—0 |
| సుతాపల్లి సుబ్బారావుగారు | రాజోలు | 6—0—0 |
| ధరణీప్రగడ వెంకటాద్రిమయ్యగారు | రాజోలు | 5—0—0 |
| చింతా శివయ్యగారు | రాజోలు | 1—0—0 |
| సాతులూరు సుబ్బన్నగారు | రాజోలు | 2—0—0 |
| పి. అప్పిరెడ్డిగారు | పెనుగొండ | 8—0—0 |
| ఇందుకూరి సూర్యనారాయణరాజుగారు | దువ్వ | 2—0—0 |
| ఇందుకూరి రామచంద్రరాజుగారు (అధ్యక్షులు)<br>భూపతిరాజు సూర్యనారాయణరాజుగారు<br>ములుకుట్ల విశ్వనాథభాగవతర్ గారు<br>వగైరా సంఘసభ్యులు | దువ్వ | 10—0—0 |
| లింగాల రామకృష్ణయ్యగారు | [illegible] | 2—0—0 |
| పెద్దింటి గోపాలాచార్యులుగారు | [illegible] | 1—0—0 |
| ఇందుకూరి వెంకట్రామరాజుగారు (అనే)<br>తాతరాజుగారు | దువ్వ | 2—0—0 |
| కల్లేపల్లి గంగరాజుగారు | దువ్వ | 1—0—0 |
| సోమంచి సత్యనారాయణ భాగవతర్ గారు | దువ్వ | 1—0—0 |

ఓం

శ్రీరాజగోపాల పరబ్రహ్మణేనమః

# భక్త రామదాసు.

## (హరికథ)





గ్రంథకర్త

"బాలభాగవతర్"

పి. ఎ. వి. ఎల్. ఎన్. ఎస్. దీక్షితదాసు.

# హరికథకుఁడు.



## చంపకమాలిక.

హరికథలోనిమూల మెవఁడంతయెఱుంగనివాఁడు? దాన సం
స్ఫురణమొకింతగల్గిన రసజ్ఞులు మెత్తురుకాని శంకరా
భరణముఁ 'దారెతోరె' యను పట్టున గట్టిగలాగి, గూబకున్
జెఱ నఱచేతఁజూపి. కథఁ జెప్పుటలో నెపుడైన నొక్కమా
దిరియయి, గీటుదాటని సుధీనిధులిప్పుడు గవ్వకైన మా
రరు; కథకుండు లోకము 'మరమ్మతు' సేయఁగ నైతికంపు టా
దరువున రాజకీయవిపథంబుల, సాంఘికబంధజాత మా
నెఱసులఁజాటుపోటరిగ నిల్వవలెన్; స్వమతంబు బిట్టుపా
మరహృదయాలు సైతముఁజెమర్ప వచించెడి వక్తకావలెన్
గఱకుఁదనంబుతోడఁ జెలికారమొనర్పని గాత్రిమాధురిన్
దొరలెడుభక్తిఁ బాడవలె దోరగఁ; బూపబెడంగెసంగు హో
స్వరసముఁ జిల్కఁగావలెఁ, లయన్ లయమై తగునృత్యచాతురిన్
నెరపవలెన్, గనుంగవ గుణింపవలెన్ నవహావభావముల్
చిఱుతఁదనాన నిల్లెదియొ చెప్పితి నానుడిఁ దప్పులున్న సా
దరమతులై క్షమింపుఁడు సదస్యులు నన్ శపియింపకెయ్యెడన్.

ఉ॥ చేతములుల్లసిల్లి, కవిశేఖరులౌనన, నాంధ్రభూమి, వి
ఖ్యాతిగడించు సత్పదనికాయము పేరి ,,సిమెంటుపోత'' నే
నాతిరచించుకోఁగలిగె వర్తనశాలల, నట్టి జాషువా
కైతకు నంజలించెదఁ నికారసుకబ్బపులాభ మబ్బఁగన్.



# .తొలి పలుకు.



పాఠక మహాశయులారా!

రామదాసుని పవిత్రచరిత్రము, కలియుగమున జీవన్ముక్తి నాశించు, ముముక్షువుల కాదర్శప్రాయమైనది. ఈమహనీయుఁడు యుగాంతరములనాటి వ్యక్తికాక రమారమి రెండువందలఏబది సం॥ములక్రితము జీవించియున్న చారిత్రక పురుషుఁడగుటచే నవనాగరికుల నమ్మికకు కూడ వెలిగాఁడు. కేవల మార్తభక్తిచే రామచంద్రుని మనసు కరఁగించి తరించిన భక్తసత్తముఁడు.

రామదాసు బాల్యమున ప్రకృతిపూజాసక్తుఁడైనట్లు లీకథలో కల్పింపఁబడ్డది. అతని నుత్కృష్టమైన ప్రకృత్యారాధననుండి రాతిబొమ్మను నమ్మి పామరునిగ మార్చిన నాయుపజ్ఞతకు విమర్శకులు పరిహసింతురేమో! ఆప్రకృతి సేవాపరాయణత్వ మస్థిరమై, జ్ఞానాజ్ఞానసంధ్యయై, బాల్యచాపల్యమునకు గురియైనది. లాటరీభాగ్యమువంటిది. పునాది కట్టుదిట్టములేనిది. ఆకారణముననే కబీరు బోధకు విలువ హెచ్చినది.

రఘురాముని ప్రమాదజనితమగు మర్దనము, రామునిమహిమచే పునర్జీవనము, కేవలము పామరులబారినుండి తప్పించుకొనుటకు, సేవంగీకరింపక తప్పినదికాదు.

రామలక్ష్మణులు సేవకవేషంబుల నవాబు యొడ్డోలగమున కరిగినప్పుడు తానితోఁబాటు సదస్యులెల్లరకు తద్దర్శనభాగ్యము కల్గినది. అందు తానీషాకు జూపిన ఘనతయేమని యందురేమో! వస్తుతత్వజ్ఞాన మెఱుఁగని మూఢులకు రత్నమైనను కాచమైనను నొక్కటియేకదా! సభికులకన్న తానాశాహిమిన్నయనుటకు తార్కాణ మతనికి రామునిచే జ్ఞాననేత్రము తాత్కాలికముగ ప్రసాదింపఁబడి, పూర్వజన్మ సంస్మృతి కలిగించుటయే!

సరసులగు తామిందలి నెఱసుల మన్నించి నాభావ్యభ్యుదయము నాశింతురుగాక. ప్రూఫ్ దిద్దుటయం దనుభవములేనివాఁడనగుటచే నం

దండక్కారము పొరపాట్లుండును. క్షమింపుఁడు. నాపొత్తమును పరిష్కరించుటకు శ్రమఁగొన్న మిత్రులు మ. రా. శ్రీ పండిత రుద్రరాజు నరశింహరాజుగారికిని, ముద్రణంబునకు వలయు ధనసాహాయ్యమొనర్చి నాకమితానందమొనగూర్చిన సుహృద్వతంసులగు దాతలకును మత్కృతజ్ఞతాపూర్వకవందనశతంబు లర్పించుచున్నాఁడను.

విధేయుఁడు,

దీక్షితులు.

## సవరణ

ప్రార్థనాదికమున „శ్రీరాడ్గోపతనూజ" యను [illegible]నందలి నాల్గవపాదము „కారుణ్యామృతపూరపూరితకటాక్షా! ఘోరపాపక్షయా!" యని మార్చి చదువుకొనఁగోరెదను.

## హెచ్చరిక.

ఈగ్రంథమునందలి పద్యములుగాని, కీర్తనలుగాని, వ్రాతమూలమగు మాయనుమతిలేనిదే యెవ్వరును „ఫోనోగ్రాఫ్ రికార్డుల" కుపయోగింపరాదు.

గ్రంథకర్త.





"BALABHAGAVATAR"

P. A. V. L. N. S. Deekshitulu Garu.

AUTHOR.

శ్రీరస్తు

# భక్త రామదాసు.



శ్రీరాడ్గోపతినూజ! భక్తహితకాంక్షీ! దివ్యతేజా! నమ
స్తే రాధారమణీమనోజ! మృదువంశీవాద్య చాతుర్య వి
సారా! పాలయమాం, పరాత్పర! పరంజానామినత్వాంవినా
కారుణ్యామృత గర్భిణీజలదవిఖ్యాతాక్షి! పాపక్షయా!

## —♦ నాటకురంజి–చతురశ్రగతి. ♦—

రాజగోపబాలా! జాలమేల!- రావేలఁజేసెదయ్య సాధుశీల ॥రా॥

అ॥ ప॥ ఈజన్మకీవే నాదైవమని- పూజసేతు నన్నుఁబ్రోవరావ దేవదేవ॥రా॥

(1) కరుణఁజూడుమంటి కరము మ్రొక్కుచుంటి- కన్నతండ్రివంటి నిన్నుఁ
దమ్మికంటి
తెరవులేని భవసాగరమీదఁ జాల- దీక్షితాఖ్యపాల దీనబంధు
గానలోల ॥రా॥

## —♦ వినాయకస్తుతి. ♦—

ఉ॥ ఈసరి కెవ్వఁడేని స్మరియింపక నిన్నొకకార్యమేనియున్
జేసియెఱుంగఁడే భయముచేతనొ! ఔనొక .యద్దుపుల్ల' నీ
వేసిన తాఱుమాఱయి మహీవలయంబు లయంబు కాదె? నీ
దాసుఁడ విఘ్నరాజ! దయఁదప్పక నన్ దరిజేర్చుమిత్తఱిన్

## —♦ కాఫీ–చతురశ్రగతి. ♦—

ప॥ గణపతి నినునే ననయముఁగొల్చెదఁ-గార్యభరమూ వహియింపఁగ
బిల్చెద ॥గ॥

అ॥ ప॥ కనుఁదెఱవని నావలన నేరమ్ము-కలుగ మన్నింప నీదే భారమ్ము॥గ

ఉన్నమన్నటు. చెప్పుచున్న నిక్ష్వాకుల
కాలికుండనును నాగరికుం డొకండు
కతకేంటి ఒకపిట్ట కతసొప్పుడని బిట్టు
చిరచిరలాడుం బామరుడొకండు
రాగమాలాపించి రక్తిముంపడు కర్మ
మను సరళిస్వరాధ్యాయి యొకండు
గీ|| ఇందఱను నొక్కసారి మెప్పించుశక్తి
బ్రహ్మకైనను గల్గదీ బ్రదుకునన వారి
కథకుండై పట్టుకంటెను గలదె కష్ట
మంబు జోద్భవు రాణి మాయమ్మ వాణి

## ** ఆంజనేయస్తుతి. **

కల్యాణి-రూపకము

ప|| శ్రీయాంజనేయ! యా-శ్రితపాలన విధేయ ||శ్రీ||
అ|| [illegible] యమ్ముంజేయు మప-జయము నవలన దోయ ||శ్రీ||
మి|| ధీయుత నేరాగ-ద్వేషమునకుం జాలక
ప్రాయమునన్ జిక్కి-తేం-బరిపరి నిన్ను మ్రొక్కితి ||శ్రీ||
(1) కాను మాంత్రికుడ నిన్ను-గట్టుకొను శక్తి కిన్
తేనెలూలక నుతింప-ధీశూన్యుడం దలంప
మానుషదేహంబున-మస్కలు పశుసమానుడ
దీనుడం గరుణింపుమా-దీక్షిత పరిపాలుడ ||శ్రీ||

## — త్యాగరాజస్తవము. —

ఉ|| తియ్యని తెల్గుబాసం గడిదేఱుకృతుల్ రచియించి, తంబురా
కొయ్యకు జీవదానమిడు కోమలకంఠము మేళవించి, రా
మయ్యను దన్మయత్వమున నాడియుంబాడి తరించినట్టి త్యా
గయ్యను సంస్మరించు మనసా! మన సాధుగుణ ప్రవృత్తికై

## కాంభోజి-చతురశ్రగతి.

ప॥ భజరేమానస! త్యాగరాజగురు- పరబ్రహ్మ మమమలం ఘనపాతక
నిగళం ॥భ॥

అ॥ ప॥ విజితైహిక తాపత్రయ మఖండ-విజ్ఞానధన మమేయ సద్గుణం॥భ
(1) నాదబ్రహ్మోపాసన చతురం-నారదమునివర దర్శనాతురం
- వాదతర్క విరహితమృదుశీలం-వర్ణిత సీతాపతి గుణజాలం ॥భ॥
(2) అక్షరానంద సామ్రాజ్యగతం-సాక్షాత్సగుణోపాసన సహితం
దీక్షితదాసాద్యభినుతపాదం-దినకరకులమణి నామవినోదం ॥భ॥

## —♦ నారాయణదాసస్తుతి. ♦—

ఉ॥ గాయకుఁడై పరాత్పరుని గాథలువ్రాయుచుఁ బాడుచున్ దనున్
బాయని శిష్యలోకము నపారదయంగని యుద్ధరించుచున్
రాయల కొల్వులందు, బళిరా'యని కీర్తిఁగొన్న మేటి నా
రాయణదాసు శేషఫణిరాజ వచోధనుఁబూజ చేసెదన్

## —♦ కుకవిప్రశంస. ♦—

చ॥ కుకవుల నింద సేయుటది గొప్పకళంకము గ్రంధకర్త. కా
రక మొకఁడుంటచేతనె తిరంబుగఁ గబ్బపుఁజేలు పండు పం
టకొదవు దృష్టిదోషము లడంగుట లెస్సమహోపకారులన్
వికచ కృతజ్ఞతా కుసుమసృష్టి సమిష్టి ఘటింపఁ గొల్చెదన్.

## —♦ స్వీయవృత్తము. ♦—

సీ॥ అధికవిఖ్యాతిఁ బ్రచారేయమై యొప్పు
భార్గవగోత్ర సంభవుఁడ నేను
మానసీయంబు వైఖానస సద్వంశ
విస్తృతాంబుధి జలబిందు వేను

అమలకీర్తులు సీతమాంబాప్పలాచార్య
పుణ్యదంపతులకుఁ బుత్రుఁడేను
శ్రీరాజగోపాల చింతవాఙ్మృత మహి
మ విరాజిత కవి కుమారుఁడేను

గీ॥ వందనీయుండు రామగోవిందశాస్త్రి
చరణ కమలాశ్రయముఁ బొందు ఛాత్రుఁడేను
హరికథకలోకమునఁ దప్పటడుఁగు లిడెడి
కుఱ్ఱలకుఁగుఱ్ఱ దీక్షితాఖ్యుండ నేను

గీ॥ అక్కసెల్లెండ్రు ముగ్గు రింకొక్కఁడగ్ర
జన్ముఁడెవ్వేళ మానసోత్సాహ మొసఁగి
నన్నుఁ దమప్రాణములకన్న మిన్నగాఁ ద
లంచి ప్రేమించుచుందురే కించలేక

ఉ॥ అన్నము పున్నముల్ దెలియనట్టి కులాంగన సీత నామక
న్నన్న మెలంగుచున్ సకల సౌఖ్యములన్ గయిసేయు బిడ్డలా!
కన్నకుమారుఁడున్ సుతయుఁ గల్గుదురిర్వురు, వారు వచ్చి రా
కున్న తమాషబాష శ్రవణోత్సవమున్ ఘటియింత్రు నిత్యమున్.

చ॥ కులుకుచు హావభావములకున్ నెలవై, శతలంకయోగి పా
టల వినిపించి యేదియొ యడాప్పుడిసేయును మత్తనూజుఁడే
ఫలమిడఁజాలునో యతని భావిచరిత్రము! దాస్యవృత్తికిన్
దొలఁగి సుఖింప నీశ్వరుఁడు తోడయి వాని సముద్ధరించుతన్

ఉ॥ భూరియశంబు సంపదలు భోగములున్ గనినారు పూర్వులా
దారిని లేమిపేరి దృషదంబులఁ దా నరికట్టి రెక్కలా
ధారముఁజూపె మాకిపుడు దైవము; పన్నులబాధఁగూర్ప స
ర్కారొకసెంటు భూమియును గల్గను మాడుతరాలనుండియున్

చ॥ అదియిది ధర్మకార్య మహితాచరణంబున మేముఁగూడ స
మ్మదము గడింతుమన్న నెటు? ,,బుద్ధులు భూముల నేల కర్మగ

డిదలను గాయు" మాకు; వికటించు నదృష్టముచేత నట్టి సం
పదలకుఁ బెట్టిపుట్ట మనవద్యగతిన్ దొలిపుట్టువందునన్

గీ॥ ఇంటిపేరుననిల్చె మాతోంటిభాగ్య
మంటకేయడ్డు? మేము 'పెద్దింటి' వార
మగుట, నిప్డైనఁ గాసునకు గతిలేదు
నూటికిన్ జచ్చులేదు నామాట నిజము

## —♦ మిత్రప్రశంస. ♦—

గీ॥ నన్నుఁదనలోన, నాలోనఁ దన్నుఁజూచు
కొనెడి పోడూరివంశ దుగ్ధనిధి విధుఁడు
'నాగరాజ'ను మిత్రుఁడెన్నఁగ మదీయ
పూర్వభవ పుణ్యరాశియై మూర్తిఁదాల్చె

## —♦ మనవి సేత. ♦—

ఉ॥ నాలుగు నక్కరంబులు వినా ఘనపాండితి దక్కలేదు నా
పాలున కీజగంబున, విపర్యయమేమొ రసజ్ఞులార! మీ
జాలికి జోలి పట్టుట యసాధ్యము కాదను నమ్మకంబు నా
కేలున కంటఁగట్టె గిలికింపఁగ నెద్దియొ దివ్యలేఖినిన్

ఉ॥ నాతలఁదన్ను సత్కవు లనంతము గాఁగలరన్న భీతి నా
వ్రాతల నడ్డబోను, భగవంతుఁడొసంగిన శక్తిలేశ మే
పాతకి చంపుకోఁగలఁడపభ్రమ, నీశ్వర సన్నిధాన మం
దాతఁడు కప్పివుచ్చఁగలఁడా? తనతప్పిద మెట్టులేనియున్

ఉ॥ సాహసముండవచ్చు, పయిసాగడియింపఁగవచ్చు. మాదృశుల్
తాహతుమాలు ధోరణిఁ గుతర్కములన్ బచరించి పండిత
స్నేహవిదూరులై మనుటచేఁగల లాభమదేమి: త్వత్కృపా
దోహదభాగ్య మాశిషముతో దయసేయుఁడు శేముషీనిధుల్

## —♦ క వి త్వ ము. ♦—

సీ॥ పైఁబటారమ్ము లోపల లొటారము, కల్గు
హీనకవితయె „పిండిలేనిరొట్టె"
సరుకుండియును, బ్రాిమిసరినోటు మతలబు
వెల్లడించుకైత „పుల్లరొట్టె"
సాహిత్యకిక్కదోడు సరికొ్రొత్త భావాల
గడిదేలు కవితయో „కమ్మరొట్టె"
జారుగుండెలలోనఁ జతురత శబ్దించు
రాణ భావకవితి „నానురొట్టె"

గీ॥ పోల్చ „జిహ్వకు నొకరుచి పుఱ్ఱె కొక్క
బుద్ధి" యనురీతి లోకుల మూలధనము
గాన దేనికి దానికే కలదు విలువ
మాటవెలితియెగాని విమర్శ లేల?

## —♦ హి తో ప దే శ ము. ♦—

గీ॥ సుజనులార! „జపాను" వస్తువులఁబోలి
నమ్మరానట్టి మన జీవితమ్ము లెప్పుడు
దిక్కుమ్రొక్కు లేక „చిటుక్కు"మనక మున్నె
మించిపోనీక పుణ్యమార్జించుకొనుఁడు

చ॥ అరయును రెండురెండు పదులాయువు నమ్ము[illegible]
దరహాసమీద నీగడువు దాటినచో నమృతత్వసిద్ధి[illegible]
దొరలనవచ్చు హైందవులు, తొల్తనె మేలుకొనుండు [illegible]
శర భవవార్ధిదిన్ గడచి కన్గొన సూక్ష్మములోన మోక్ష[illegible]

## —♦ కన్నడ—చతురశ్రగతి. ♦—

ప॥ కలిలో హరినామస్మరణకన్న—కలదె తారకము [illegible]
అ॥ ప॥ పలుతెఱఁగులఁ జింతింతురేల? [illegible]
ధృతిజార ॥క॥

(1) యజ్ఞయాగాదులఁ జపతపంబు-లాచరించి తరియింతురన వీల?
ఆజ్ఞతెకద! "యుట్టికెగురలేని-యమ్మ స్వర్గమున కెగిరెనసులీల॥గ॥

గీ॥ "హోమిరోపతి" మాత్రతో రామనామ
మెన యనందగు నద్భుత గుణమునకును
సూక్ష్మరూపంబునకు వాడి చూడుఁడంయ
గల యథార్థముమీక నిక్కముగ తోఁచు

ఉ॥ కొండలపాటుతీరఁ దనకున్ లభియించు గురూపదేశముఁ
బొంది, జపించి తారకము మోక్షరమఁ గయికొన్న రామదా
సుం దలపోయఁ జిత్తపరిశుద్ధి నడంగదె పాపపుంజ మే
సందడిలేని డెందమల సాంగముగా వినుఁడయ్య తత్కథఁ

చ॥ తనకవితామృతోరుఝరి "దాశరథీ కరుణాపయోనిధీ"
యనుమకుటంబు తావుగ, త్రయంబక శీర్షవిముక్తమైన గం
గను సుపమింప నెల్లెడ నఖండముగాఁ బ్రవహించె యీ మహా
త్ముని నలరించె నా సుగుణభూషణు సత్కథ నేవచించెదఁ



శ్రీ

# భక్తరామదాసు



## కథాప్రారంభము.



### కల్యాణి-రూపకము

ప॥ రామదాసచరితము వినరండు సుజనులార! చెవులార ॥రా॥

అ॥ ప॥ భీమభవార్ణవము దాటువిధముఁ గనుగొనుఁడు వెతలుడిగ ॥రా॥

చ॥ కామితమొదఁగూర్చు తారకము జపించుచున్ ఏకుఁడై

ధామమునకు రామునికృపఁదరలిన ముముక్షువంట ॥రా॥

*1) కలో జీవన్ముక్తినిఁగన్న భక్తమణిమాలిక

నలరు మేరు గోపన్న! అతని కతఁడె పోలిక

కాలువమరియుఁ బాడుపట్టు కూటికాత్మ స్వాతంత్ర్యముఁ

దోలఁగఁ ద్రోసికొనఁడు దైవదూషణఁ గలనైన వినఁడు ॥రా॥

* గీ॥ "అబుహాస్సను కుతుబుశాహా"భిధానుఁ

డేలు గోల్కొండరాష్ట్ర ప్రపాలనమున

కంకితంబయి, సామరస్యమున మెలఁగు

ప్రజల నలరారు నేల్కొండ పల్లెయందు.

---

(1) క్రీ॥ శ॥ 1658 87 వఱకు అబుహాసన్ కుతుబ్ శాహా ... గోల్కొండరాష్ట్రమును పరిపాలించెను. హిందూమహమ్మదీ... యిర్వుర నాతఁడు సమముగా గౌరవించి యాదరించుచుండెను. ప్రజలాతని మెచ్చి "తాన్ శాహా" యని పిలుచుచుండిరి. "తాన్ శాహా" యనఁగా "మంచిరాజు" అని యర్థము. "తాన్ శాహా" యన్న ... క్రమముగా "తానిషా" యను రూపాంతరము నొందినది.

## మంజరి-సారంగ

కంచర్లకులాంబుధి చంద్రుండు లింగన మంత్రియును ఘనుండు
అంచితముగఁ గామాంబ పేరిడి యిల్లాలిఁగూడి సుఖముండు
ఆతఁడాత్రేయసగోత్రుఁ డాది శాఖావలంబకుఁడు మఱియు
సతతము భగవత్పాద సేవనా రతి మోదాశ్రులఁ గురియు
ఆపుణ్యదంపతుల భవార్ణవం-బవలీలను దాటింప
గోపన యను పుత్రుఁడు కర్ణధారుఁ-డైపుట్టె యశముఁబెంప

చ॥ గోనములకాటపట్టు; పసికూనయెకాని, మనీషలెంతురా
తనిఁ దనలే బుజాలపయిఁదాల్చె జరాన్వితశీర్షమంచు, గో
పన కిఁక ద్రేలువంచి తెలుపన్ సరియెవ్వఁడు? పూవుపుట్టినం
తనెగడు సౌరభమ్మను బుధప్రతిపాదవ సార్థకంబగున్

## ఆనంద భైరవి-ఖండగతి.

ప॥ గోపన్న బాల్యమిది-గో యిట్లు కడచెనని

అ॥ ప॥ సాపుద్రాయఁగ శక్తి-చాలునా లేఖినికి ॥గో॥

మి॥ పాపిఁగోరి యొండొరు-ద్రోపిడి కోపిగుణము
"లో పుణ్యచరిత! నే-నుంటి నేనుంటి" నన ॥గో॥

(1) వినయదృక్సుమరాజి-విబుధులఁదనుపు సోద
రుని భంగి నాదరిం-చును కన్న నిరుపేద
ననయము చింతించు న-నంత సృష్టిమూలముఁ
దనమదిఁ బలుయోచన-లెనసి సలుప నాలము ॥గో॥

చ॥ కలిగెడు బాటసారి యఱకాలికి బాధయటంచు, గాజుపెం
కుల శితకంటకాలఁ గనుగొన్న మఱుక్షణ మేరి పారవే
యు లలితవర్తనంబున; మహోపకృతిన్ గతిమాలు పేదవా
రలకొక పెద్దదిక్కుగ మెలంగఁజూడీ తలలోని నాలుకె.

గీ. బాలభటభావ మైదేండ్ల ప్రాయమందె
సంఘసేవకు వానిఁ బ్రోత్సాహపరచె
నాతఁడాలించి గీతారహస్యమొందు
పండితుల నోటఁ బ్రకృతి తత్వమునఁ జిక్కె.

## కాఫీ మిశ్రగతి (గేయము)

ప॥ బలితమగు నజ్ఞానభిత్తికఁ
దొలఁగఁ ద్రోయుచు నన్ను నీలోఁ

అ॥ ప॥ గలుపుకొను మానందవీధిని-నిలిచి యాడెదను
ఓ ప్రేమమయ! కలకంఠ నిస్వన-మొలయఁబాడెదను ॥బ॥

౨

పచ్చికను బవళించి తన్మయము
భావమున నిన్ గవుఁగలించిన
యట్టి సుఖమొందియును లేచిన-యంతమరచెదను
ఓ ప్రేమమయ! నాలో నవిద్యను-గొట్టవెరచెదను ॥బ॥

౩

నీలమేఘముఁ గనినయంతనె
నీవయని తోఁచియును నదిపెను
గాలిరొదలో మాయమైచనఁ-గలవరించెదను
ఓ ప్రేమమయ! సత్యమున కెడమై-పలవరించెదను ॥బ



౪

పూలగమి నీమందహాసము
పూర్వగతిఁ దిలకించెదను జీ
వాల దృగ్జాలముల నీతేజంబుఁ గాంచెదను
ఓ ప్రేమమయ! నేనంతలోనవి విస్మరించెదను ॥బ॥

సీ॥

కోలకులంముల విరియు కెంద
మ్మిల ముదంబలరంగఁగని నీ
సలలితారుణ మృదుపదంబుల- జ్ఞ ప్తిఁ బొంగెదను
ఓ ప్రేమమయ! నాతలఁపు నిలకడ-లేక క్రుంగెదను ॥బ॥

గీ॥ అనుచుఁదన లేయెడంద భావాంకురములు
పుట్టి గిట్టుచు సుగ మరికట్టుచుండఁ
బ్రకృతి జిజ్ఞాసఁదవులు డింభకుని బడికిఁ
బనుప యోచించి జనకుఁడు పలికెనిట్లు

తోడి-రూపకము.

ప॥ ఒజ్జలకడ విద్య నేర్వ-పోయి తండ్రినీవు
అ॥ ప॥ సజ్జన మైత్రిన్ గడించు-సద్గతి కది తా ॥పో॥
(1) కల్లలాడఁ జనదు కష్ట-కాలమైనఁగాని
పల్లమఁడై నరుఁడు సలుప-రాదు ధర్మహాని ॥పో॥
(2) గురుని దైవమని తలంచి-కొలువ వలయు భక్తిఁ
తఱచు తెలియు నీతుల నా-చరణ నిడుట హితము ॥పో॥

గీ॥ అటుల బుద్ధులఁ గఱపి గోపన్న నప్పు
డక్షరాభ్యాస మొనరించి శిక్షఁబొందఁ
బంపెఁ దమయూరఁగల ధర్మ పాఠశాల
కభ్యుదయ మాసఁజేసి లింగన్నమంత్రి.

సీ॥ రైతుబిడ్డల మార్చ్యలను నాస మురిపించి
కూరనారయు నేరు కొనెడివాఁడు
కుండలు డింకీలుగొట్ట జీతాల్ రాక
బోర్డుపై దుమ్మెత్తి పోయువాఁడు
నాస్తియా నిజబోధనాశక్తి నెట్టులో
ఓట్టుకొట్టులఁగూడఁ దీయువాఁడు
తనసంచికట్టు వైద్యాన గ్రామసుల
మంచి టానిక్కను మటాయించువాఁడు

గీ॥ చాటుమాటులఁ బ్రెసిడెంటు చావుఁగోరి
చేతఁబడి తంత్రములను యోచించు మూఢుఁ
డొకఁ డుపాధ్యాయవృత్తి నాయూరఁ గలఁడు
"పిలక ఎలకయ్య పంతులు" పేరి వాఁడు.

ఉ॥ ఎత్తునఁబడ్డగొడ్డు వయసేబదిలోఁ బ్రియినింగ గడ్డమే
సత్తువలేదుకాని, పయిసాయనినక్క భ్రమపోదు, మేటియా
బెత్తపుజోడు పాడుబడి పిల్లలయల్లరి వేడియన్న పుం
మత్తున కడ్డురాదు, కవితూనసచోరఁ డతండు మూర్ఖుఁడే!

ఉ॥ ఉత్తరకుట్టు గౌరవము నొందినధోవతి, నీవుమీద కిం
చిత్తొకమూలగా నతుకుఁజేర్చిన కోటిక నూలుపగ్గపుం
బొత్తునఁ గోలయద్దముల పొందికనొప్పు సులోచనాల జో
డెత్తుడుగడ్డ లాకృతి వహించిన పాగయు వానికే తగున్.

గీ॥ తన్ను[illegible]ని చచ్చుచుండు, నింతకునతండు
మున్ను గడ్డము గొరుగించుకొన్న లేది
సరిగఁదా నిగ్రహించు నేర్పరి తనాన
కీర్తిఁ బొంద "రిసెర్చివర్కింగు కమిటి"

## మంజరి—ధన్యాసి

తన క్రొత్త శిష్యునకు 'నోనమాలు'—నెనరుమై వ్రాసియిచ్చి
పునరుత్సాహము కొరకొక చిటికెడు-పొడుముఁబీల్చి కనువిచ్చి
కంటిజోడు సవరించి చావుకే-కను "సైలెన్స"ని యార్చి
పంటిబలము వ్యాయామమునఁగూర్చు-బటాణీలఁ దిన నేర్చి
"బాలురార! మనవలె జీవులెల్లఁ-బ్రాణయుతములే కనుక
తాలిమివహించి భూతదయ నెరపఁ-దగు నివ్విధమువ్వియనక"
అనిపాఠముఁ జెప్పువేళ గోపన-యట్టలేచి "గురువర్య!
మనమున సందియమెడప మిమువేడు-కొనెద నొందు గుణధుర్య!

గీ॥ కలవు జీవులుఁ జలములఁ గలవుగాలిఁ
బాదముద్రాంకితంబగు మేదినిఁగల
"ఆత్మవత్సర్వభూతాని" యనుచు నీతి
నిలుపుకొన మానవునకెందుఁ గలదుతావు?

గీ॥ పూలుఫలించి సృష్టిబీజాల ధాత్రిఁ
జల్లుమనుముందె 'పురిటిలో సందికొట్ట'
దైవపూజకుఁ గుసుమ సంతతులఁగోయ
పాపమా! పుణ్యమా? యని ప్రశ్నఁజేతు.

గీ॥ గాలిఁబీల్చక క్షణమైనఁ గడుపఁబోదు
కూడుగానిన మలమలమాడుఁబొట్ట
నీరుఁగ్రోలక తృష్ణచల్లార దవనిఁ
గాలుమోపక యంతరిక్షమున కెగరి
పోదుమన నందు జీవులపుట్ట; మనుజుఁ
"డాత్మవత్సర్వభూతాని" యనుచు నిష
నాచరించుట తాఁ జచ్చియా? బ్రతికియ?

మ॥ తడబాటేమియునొంద కట్లడుగఁగోరికమానిని గోపన్న "నో
బడవా! నీతల తిక్క ప్రశ్నలకు నాప్రత్యుత్తరంబిద్ది" యం
చొడిపెట్టెన్ జెవులయ్యవారు, విజయంబూహించి బెత్తముతో
పాడలంగొట్టెను వానిఁ? దయ్యములముందాబిడ్డ"లో దైవమా.

గీ॥ బడివిడుపుగంటఁగొట్టి యాబాలకుల వి
శాలమౌబయలులో వరుసగనునిలిపి,
చూచి. వ్యాయామమున్నెర్పుచున్న వేళ
గోపనమనంబు జగదీశుఁ గొలిచెనిట్లు.

## కేదారగౌళ–చతురశ్రగతి

ప॥ నేల, నింగి, దిక్తటములనిండిన-నీరజాక్ష! యిదెవందనము ॥నే॥
అ॥ ప॥ చాలనాల్గువర్ణములకిక్క-యౌ-జగన్నాథ! కొనువందనము ॥నే॥
(1) ఊర్పుపోతతీతల సృష్టిలయము-లొనరించుతండ్రి! వందనము
దరోద్ధతి బలిఁ బాదహతి రసా-తలికిఁద్రొక్కు ప్రభు!వందనము ॥నే॥

(2) కలితశంఖచక్రాయుధమండిత-కరకమల నీకు వందనము
బళి! చతుర్ముఖబ్రహ్మగను శ్రీని-వాసవిభు! యిదెవందనము ॥నే॥

చ॥ జనకునభీష్టమున్ నెఱపఁజాలి జమున్ దలపించు నోజ్జప
ట్లను వినయంబుతో మెలఁగుటన్ సమలెన్మిది దాటె నూకదం
పునఁబడి; జన్మసార్థకతఁబొందెడి విద్యలభింపదయ్యె గో
పనకు జిఘృక్షుఁడై ప్రకృతిభావరహస్యముఁగోరి యాతడున్.

కం॥ పరిపరివిధముల యోచన
నెఱపెడిచో, బ్రహ్మచర్య నిష్ఠఁదవులఁగా
జరిగె నుపనయన మతనికి
మఱి నాల్గేండ్లకున్ బెండ్లిమాటలువచ్చెన్
గీ॥ ప్రథితసత్కారకాండ మాపైనఁ బెండ్లి
కొడుకుచూపులుముగిసిన కొంతవడికి
వధూపితండ్రి వినమ్రుఁడై ''బావగారి
కెంతకట్నపుభ్రమేం సెలవీయుఁ'' డనుచు.

చ॥ అటు తనుఁబ్రశ్నఁజేసి, తుదకప్పులపాలయిపోమనంచు సం
కటపడు భావమాతని ముఖానగ్రహించుట, జాలి నొంది ''యా
కటికయి నాకుమారుఁ దమకమ్మను, నాకయి దాచుకొందు, మీ
రటమటఁజెందఁబోకుఁ డభయంబనె లింగనసాదరంబుగన్
గీ॥ దప్పిఁగొనునాతఁ డమృతసంతర్పణమున
నలరురీతిని క్రొత్తవియ్యంకుఁడలరి
తనకొమరి కమలనొసఁగి గోపనకుఁ బరిణ
యోత్సవమొనర్చె నిష్ఠురమొదవకుండ.
ఉ॥ పెండిలిముచ్చటల్ గడిచె పెద్దగ, నట్లొక కొన్నినాళ్ళకు
ద్దండపరీక్ష లొఁగిన విధంబున డెందముసందడింప ఖి
న్నుండయి ''మానవుండెటు ఘనుండగు? స్వార్థపరత్వమన్న నొ
మొండతగాని'' కంచను నిమేషము గోపన యోజసేయుచున్

## సారంగ-ఖండగతి (గేయము)

ప॥ జ్ఞానమునకిక్క నర - జన్మ దుర్లభమే మొ
కానియాసలనీను - కల్పతరువగుట

అ॥ ప॥ నేనిది మెచ్చనో దేవా! — వడినన్ను
దీనికిఁ జాలిఁజేయు లేవా?..............॥జ్ఞా॥

౨

క్రొమ్మావి చివురఁ జొం - పమ్ములఁ మెక్కి, నా
కోర్కెతీరఁగను బుం - స్కోకిలమునై - నీ
ప్రేమగీతముఁ బాడుకొందుఁ - బొరపొచ్చ
మేమిలేకను హాయి నుందు..............॥జ్ఞా॥

౩

అందమగు విరితండ - మందొక్క సుమ[illegible]
చిందిలుచు సౌరభముఁ - జిఱుగాలిఁగ[illegible] నీ
మందహాసముఁ బంచుకొందు - సామి! నా
మనసెంతొ పరితృప్తిఁజెందు..............॥జ్ఞా॥

౪

కుసుమాసవద్రవముఁ - గ్రోలి, తృప్తిలి మధుర
రసము చిప్పిలు వేణు - రావంబునకు శ్రుతిన్
విసరనిమ్మా షట్పదమునై - తండ్రి! నా
యసమర్ఘ్యాంకృతులలో లయమై..............॥జ్ఞా॥

౫

నే మాలతీలతా రామమునై, నినుగున్న
మామిడిగఁ బోల్చి నా - కోమలకరాలఁ
బ్రేమ మీరఁగఁ గౌఁగిలింతు - నాప్రణయ
సామర్థ్యమే మొ చూపింతు..............॥జ్ఞా॥

౬

నీలాంబుదంబీవు-నీచాటునన్ దటి
ల్లలనై డాగి సువి-శాలమగు నీసృష్టి
జాలముతో దోబూచులాడ-ముచ్చటలు
జాలువారెడు మదిని రేఁడ! ... ... ... ||జా||

౭

పేరెములువాఱు నెల-ఱేఁడులై, నీదివ్య
కారుణ్యలహరిఁ జెలు-వాఱు సత్యముజగతి
నోరూర వినిపింతుఁ జూడు-నాజలజ
లారావవాక్పటిమ నేడు ... ... ... ||జా||

గీ|| పరికృతిలీనుండుగా స్వభావమున నలరి
ఈశునటు వేడు, మఱలఁ దదాశయమ్ము
మార్చు[illegible] నేమి పిలిపిచ్చిమతమొకాని
అతఁడు నైరాశ్యగీత మిట్లాలపించు.

గీ|| తతకుహూకార మకరంద ధారఁ జొక్కి
పరభృతపదానుభవ వైభవంబుఁ గోరఁ
గాని చిఱుఱెక్క సారించు లోనఁదొడరు
కాకిముకుపోటుఁదలఁచి బెంగటిలుమనసు.

గీ|| సౌరభనిమంత్రి తానిలాస్త్రచయమేసి
జీవపాళినిమురిపించు పూవునాట
కాసవడు దంతలో నడియూస తోఁచు
గోరుగిల్లున కెడఁద గగ్గోలుఁబడుట

గీ|| కడునిరాడంబరముఁ దృష్టిఁగలిగి నాటి
పొట్టమంటకుఁదగు పొల్లుఁబోసికొనెడి
పులుఁగులం దొక్కదానపై పోదుమన్న
వ్యాధుని తుపాకిగుండుదెబ్బకును వెఱతు

గీ॥ పత్త్రిపల్లవకుసుమ సత్ఫలమనోజ్ఞ
కుజమునై మాపటికిఁ గన్నుఁగుట్టఁజేయ
మనసుపుట్టియు భయదగ్రీష్మప్రతాప
శాసనకఠోరతకు హతాశను దళింతు

గీ॥ మృదుతనూలత మిలమిల మెఱయఁగ విరు
మూరు సుమముల కుసుమేయ గౌరవంబు
బొంద నేనొక్క తృణకణంబుగనుమూర
మనుజచరణాంకితానలంబున నశింతు

గీ॥ చిత్రకళలూరు పక్షవిక్షేపణమున
గులికియాడు సీతాశోకచిలుకనాట
కలరెదన్ గాని దానిపూర్వాశ్రమంపు
దుష్కులీనత వెగటుగాఁదోఁచు నాకు

మంజరి—నీలాంబరి

అట్టుల నవీనభావోన్మాదుం-డైన తమసుతున్ గాంచి
బిట్టువగచి తలిదండ్రులాతనికి-బిచ్చిపట్టెననియెంచి
కోడలత్తరిన్ వ్యక్తురాలగుటఁ-గొంత మేలుఁగఁదలంచి
నాఁడెముహూర్తంబునిడి పునస్సం-ధానంబుం బొనరించి
తమయింటి కావెఁగొనివచ్చిరైనఁ-దానఫలము లేకుండెఁ
గ్రమముగ గోపనధోరణియు స్థాల-కమ్మకట మాఱుచుండె.

చ॥ తగునుపదేష్టకోసము సదాపలవించుచుఁ దానుదిన్నచో
టఁ గునుకుఁ గున్కుచోటఁ దినుటల్విడి, త్రిమ్మఱుఁ బెక్కు-
[భూములన్
బగలిది, రాత్రియిద్దియను భావములేక; లభింపఁడట్టి వాఁ
డగపడుఁ జిల్మగొట్టుపుమహాత్ముఁడె తానెటకేగిచూచినన్

గీ॥ అంత తనకర్మ పరిపక్వమయ్యెననఁగ
నదరెఁ గుడికన్ను శుభశకునంబులొదవె
నొక్కవనసీమఁ దిరుగాడుచుండ నదరె
ఖేదమునడంచు సాధుభానూదయంబు.

సీ॥ కరఁగిపోసిన సాత్త్వికప్రతిమాయన
నాకర్షణీయ దేహంబుతోడ
త్రిస్థాయిఁ బ్రోగుఁ దంత్రీనాదమోయన
రవత్రుళ్ళ గాత్రమర్యాదతోడ
అతినిరాడంబరమైన జీవికఁజాటు
నొప్పారు టెంకాయచిప్పతోడ
మనసిజుఁదూపునాటని తనుత్రాణమో
యనఁదాల్చు జేగురుటంగితోడ
గీ॥ దనరి, జంగమతీర్థమోయనఁగ బీరు
పారవశ్యమ్మునకులోఁగి ప్రకృతికాంత
చేష్టలన్ డిందిచూడ వేంచేసె నాట
పాటలన్ రామనామప్రభావమడర.

## —♦ గౌళిపంతు-ఖండజాతి త్రిపుట ♦—

ప॥ జానకీరమణ-సకలసద్గుణాభరణ-భవాబ్ధితరణ ॥జా॥
అ॥ ప॥ దానవమదహరణ-దశరథానందకరణ-మౌనినుతచరణ ॥జా॥
(1) నీలనీరదశ్యామ-నిరుపమతారకనామ-రఘురామ ॥జా॥
పాలితపితృవాక్పూత-భక్తపారిజాత-జనకజామాత ॥జా॥
(2) శివకార్ముకభంగ-శిష్టజనహృదబ్జభృంగ-ధవళాంతరంగ ॥జా॥
దివిజావనశీల-దితిసుతలయకాల-దీక్షితదాసపాల ॥జా॥

గీ॥ భక్తిభావంబు విద్యుత్ప్రవాహసరణిఁ
బేరెములువాఱఁ బ్రొక్కి కబీరుపాద
పంకజరజంబునాదల కంకితంబొ
నర్చి గోపనపల్కె వినమ్రుఁడగుచు.

## —♦ నాటకురంజి-చతురశ్రగతి ♦—

ప॥ సాధువర్య!నన్నుద్ధరింపనిటు-సాక్షాత్కరించినావిమహానుభావ ॥సా॥

అ॥ప॥ నేధన్యతముఁడ నైతిఁ జాలసందేహ మేల? సుజనపాల! ఘనగుణాలవాల

మి॥ మేదినిపైనరజన్మ దుర్లభ-మ్మొదయామయా? స్వార్థపరత నా
మోదమంచు నజ్ఞానికెటులబ్బు-మోక్షపదవి యానందచిద్ఘనా॥సా॥

చ॥ దురితవిదూర! నామదికిఁదోఁచినరీతి వచింతు భూమికిన్
గొఱఁతయె వేరుపుర్వు? తనకున్ దనపొట్టకు దేవులాడుచున్
బరసహానంపుమాట నిజభావనిఘంటువునందు లేని యా
నరుఁడు నరుండొకో? తృణకణంబును నాతనికన్నమిన్నయౌ.

గీ॥ నిర్గుణారాధనమ్ము మన్నింపవలెనొ
సగుణము భజింపవలెనొ తోఁచదిపుడొకటి
గాలితోనూసులాడు మూర్ఖతయు, నొకటి
కఠినపాషాణతతిఁ గూర్చుకొఁగలింత.

కం॥ అనిప్రశ్నించెడు గోపన
మనమునఁ బెనగొన్న చింతమాన్పి యినకులే
శుని భక్తుఁజేయుతలఁపున
వినుతగుణోపేతుఁడొక బీరుఁడిట్లనెన్.

—♦ మోహన-ఖండగతి ♦—

ప॥ అవధరింపుము వత్స!- భవరోగపుఁజికిత్సఁ
దవిలివిజ్ఞానచి-త్తమున స్వస్థతఁగాంచుమా-ననువిశ్వసింపుము ॥అ॥

అ॥ ప॥ వివరింపమానవవి-వేక మవినాశమై
రవిశశాంకముఁ గిరి-రాజ్యమేలుట సత్యము-దేహంబనిత్య॥ము॥

(1) కలపుట్టువలఁబుట్టు-కడగొట్టు నరుఁడెట్టు
లలఁతియౌఁ దనజ్ఞాన-బలముఁగోల్పోవుదాఁక-నీకిది వెట్టిగాక●
పలుకకు ముదాహరణ-పాత్రమ్ముగ శతుల ని
ర్మలజలముఁగప్ప కై-వలమట్టువారిమనసు నావరించునవిద్యాదిను॥స॥

మ॥ జగతిన్ దోఁచెడు వసుసంతతుల తేజఃపుంజ మందెన్నఁ ద
న్నిగమాతీతుఁడు సాక్షిమాత్రుఁడగునంతే! వైకృతింబొందుచో

నిగుడంబోఁడట; శాశ్వతుండఁట దేవుఁడిమ్మ! నానిఁజేపట్టు నా
సగుణోపాసన మోక్షసాధనము కల్లా! వింటివే సత్యముల్.

గీ|| సగుణము ప్రసాది నిర్గుణ సౌధమునకు
చపలచిత్తుని యజ్ఞాన మపనయించి
సుగతిఁదార్చు నపశ్రుతి నొగలి తెలితిఁ
దవులఁగొంతును వీణెమెట్లవలెనదియు.

సీ|| సగుణమా కాద? క్రైస్తవభక్తి మునుముందు
సిలువ మానసవీధి నిలుచుకతన
సగుణమా కాద? ముసల్మానుభక్తి పై
గ్నాల తేనెఁదలఁపు సంధించుకతన
సగుణమా కాద? వైష్ణవభక్తి రాముకృ
ష్ణులయాకృతులఁగోరి కొలుచుకతన
సగుణమా కాద? విజ్ఞానిలోకముభక్తి
జ్యోతిస్వరూప మెంచుకొనుకతన

గీ|| సగుణమా కాద? ప్రకృతిపూజనము జగతిఁ
జెట్టునో పుట్టనో తలపెట్టుకతనఁ
గాన నిశ్చలభక్తిమార్గమ్ము సగుణ
తత్త్వమునఁగాని చిక్కునే? తండ్రినీకు.

మ|| వరవర్ణద్వయసామరస్యమున నద్వైతపరిభావంబు సు
స్థిరమౌనయ్యది రామతారకము కాదే బిడ్డ! తన్నామమే
మఱికన్ గోరిజపింప మోక్షపదసన్మానంబు సిద్ధించు, భీ
కరసంసార మహార్ణవంబనిన తెక్కాపత్రిమా దానికిన్.

ఉ|| రాముని శైవసంతతి పురారియటంచు నుతింతురి, వైష్ణవుల్
వేమఱు విష్ణువేయను వివేకమునన్ భజియింతు, రవ్యయ
ప్రేమను సామరస్యమున విజ్ఞులహో! ప్రణవస్వరూపుఁడం
చామహితాత్మునెంచి కొనియాడుదు, రాతఁడు ప్రాకృతుండొకో?

— శంకరాభరణం—త్రిశ్రజాతి త్రిపుట —

ప॥ రామచంద్రునికన్న దైవల. లాము డన్యుఁడు లేడోయన్న-గోపన్న ॥

అ॥ప॥ ప్రేమమయుఁడినవంశదీపకుఁ-డామహాత్ముఁడుదారశీలుఁడు ॥

మి॥ తామసగుణరహితుండు జనక-జామనోహరుండుఁ సుగుణో
ద్దాముండుఁ నీలనీరద-శ్యాముం డఘువిరాముండునగు శ్రీ

(1) మనుజధర్మము మనకునిరతము-వినుచు నాతని దివ్యచరితము
మునిగణం బాలావణ్యమూర్తినిఁ-గనుటకేకద పొంది రార్తిని
నినుననునెల్లరఁ దరిఁజేర్చి-నిఖిలకష్టచయముల దీర్చి
కనికరించువాఁడతఁడేసుమి-ఘనభక్తి వానినారాధించుమి ॥

సీ॥ భక్తితోఁ బ్రథమావిభక్తి నారాధించి
సాధించుకొనుము నిశ్చలమతమ్ము
భక్తిద్వితీయావిభక్తి నారాధించి
తారకతత్వచింతనము నెఱపు
భక్తిఁదృతీయావిభక్తి నారాధించి
విపులసృష్టిరహస్యవేదివగుము
భక్తిఁజతుర్థీవిభక్తి నారాధించి
బ్రదుకు మీతుచ్ఛసంపదలరోసి.

గీ॥ పంచమినిఁగొల్చి పరదైవభావముడుగు
షష్టిఁదలపోసి దివ్యతేజమునకెఱఁగు
సప్తమికిమ్రొక్కి యద్వైతసరణిఁగనుము
రామశబ్దార్థమహిమ తెల్లమగు నీకు.

మ॥ యతులన్ గొల్వుము, తీర్థయాత్రలనుజేయంబొమ్ము, దేవాల
ప్రతతిన్ భక్తినిరోధలోపములఁదీర్పన్ జాలి, సంస్కారద
క్షత, నభ్యాగతి కన్నదానకృత సత్కారంబుసిద్ధింపు, మ
ర్చిత రామప్రభుపాదయుగ్మమునఁ గీర్తింబొందుము శాశ్వతమౌ

కం॥ జననీ జనకులు నినుగో
పనయని పిల్చుకొనిరింతపైనీక నేఁబె

ట్టిన పేర "రామదా" సని
నినులోకులు మెచ్చి పిల్వ నేర్తురటంచున్.

## —♦ మాంజరి–కేదార ♦—

పరమపావనంబగు తారకమును-భక్తునకుపదేశించి
గురుశిష్యులంటుగ గోపనపుత్రుఁడు-లుం-గొని కబీరువారినెంచి
పాడుచునాడుచు నేగెఁ దనదారి-బట్టి రామదాసునకు
నాడె దాశరధి పదకమలములభక్తి-నాటె భవతరణమునకు.

మ|| తలిదండ్రుల్ గతియించి రాతనికి సీతారాములజ్జూపి, ని
ర్మలహృత్ప్రీతిని నిల్చెఁ దారకపరబ్రహ్మమ్ము నిశ్చింతమై
ఫలియించెన్ సతిగర్భవాసమున సుతప్రాప్తి న్విడంబించి, యా
మొలకన్ రాఘవు పేరఁబిల్చి రఘురాముండంచు గోపన్నయున్

చ|| చిదివి[illegible]పాలుగారు నును చెక్కు, లకృత్రిమమందహాస సం
పదఁ జె[illegible]లువానన, మహారశ్మిప్రకాశ వీక్షణంబు, లు
చ్చదశకు [illegible]లవాలమగు సద్గుణపుంజము, మాట తేట యొ
ప్పిదమయి, తండ్రికిన్ దగిన బిడ్డఁడగున్ రఘురాముఁడాదటన్

## —♦ బళహరి–రూపకము ♦—

ప|| రామదాసౌనర్చి సమా-రాధన లెడ తెగనిభక్తి ||రా||
అ|| ప|| 'రామార్పణ'మనుచు నహో-రాత్రములాసించి ముక్తి ||రా||
మి|| భూమియీనిన ట్లతిథులు-వేమఱు బలిసిరా గ్రామ
గ్రామంబులనుండి కీ-ర్తి-కామినిపిలుపునఁ బ్రేమ ||రా||

(1) పలురకముల మేలిపిండి-వంట, లప్పడములు, వడియ
ములు, చిత్రాన్నములిఁకేమొ-తెలుప నొకటోరెండోయనియ
కలిసి హరిస్మరణము భో-క్తలుపచరించు నప్పేళఁ
దలఁపింపఁచుఁబయోధి వీచి-కలఘూర్ణిలురవముచాల ||రా||

సీ॥ మాకఁగంభీరసామగ్రి చిక్కెనటంచు
శ్రీరామ్నరుచిఁ బ్రశంసించువారె
అదిబెండకాయకూరా! కాదు నవనీత
పుక్కమద్దరాయని పొగడువారె
బొబ్బట్లతో నిండిపోయె నాపొట్ట, త
క్కినవెట్టులుండెనోయనెడివారె
దానితస్సాగొయ్య! దప్పళమా! యమృ
తంబని ధన్యవాదమిడువారె

గీ॥ మెటికి "నలభీమపాక" మన్నిటినటుంచు
గారెలమృతమ్వ మబ్బబ్బ! గట్టిమండ
కొడుకులేసుమి" యని పాచకులను మెచ్చు
కొనెడివారలె యెచటఁజూచినను సరియె.

## —♦ మంజరి–కాంభోజి ♦—

సంతర్పణములు శ్రీరామమహోత్సవము లెన్నో గోపన్న
అంతులేనటులొనర్చెఁ దనయాస్తికబ్బనొక బండిసున్న
"దాశరథినమ్మువారికి దరిద్ర తేశరణ్య" మనుమాట
తొగ్రిసిపుచ్చరాదపుడైన రామదాసుమది రాతికోట
తమలేమికి నంగలార్పసతి నాతఁడుబుజగించి బిట్టు
భ్రమనడంప విజ్ఞానబోధ నాపడఁతితో ననియెనిట్టు

ఉ॥ కోమలి! మాఁడునాళ్ళబ్రతుకున్ మురిపించెడిపాడుపొట్ట తా
నేమి నిగూఢతత్త్వమువహించెనో! దానిగ్రహింపఁజాల డీ
పామరతావిమూఢ నరపాండితి; ఈశునెఱుంగ నేర్చునే
రాముఁడెరక్షకుండు బిగలాపడ నేటికి మాటిమాటికిన్,

చ॥ కటికిదరిద్రులాటఁ గొఱగంజికిఁగూడ మొగమ్మువాచి సం
కటపడి, సంఘనిష్కృతిని గాసిలు దీనులులేరె వేనవే
లిటుమరపిల్ల నేల? పరమేశ్వరు దివ్యవిలాస మెప్పుడె
ప్పటికెటుమారుచుండునో! యెవండుసమర్థుఁడెఱుంగ మానినీ

ఉ॥ మానిని! నేటికిన్ భరతమాతకుఁ గాన్పుడుగంగలేదు; సం
తానవిరోధశాసన మనాదృతమయ్యెడు నామె చెంతఁ గ
న్నానను మాటె కాని, తననందను లెట్లు దరిద్రదేవతా
ధీనత గ్రుంగుచుండిరో మదిన్ దలపోయ దదేమి హేతువో.

మ॥ మనకున్నంతకు లోటు చేసితివె కొమ్మా? రామసేవార్పణ
మ్మనకున్; గాలము తప్పి వచ్చినది; రాముండింక నీమీఁదటన్
దన కార్యంబును దానె దిద్దుకొను; వింతా! "అలికిన్ గూడుఁ బె
ట్టిన యూరందరికిన్ మహోపకృతి" యంటే విన్నవార్నవ్వరే?

చ॥ అలరెడు గోలుకొండపురి నక్కనమాదనగార్లు మేనమా
మలు కల రానవాబుకడ మంత్రులు వారటకేగ నేదియో
ఫలము లభింపకున్నె? రఘువర్యుని సేవకటంచుఁ బల్కఁ బో
వలెనికఁ బ్రొద్దు చాలదతివా! త్వరితంబుగ గంజి కాఁచుమీ.

గీ॥ అనుచు నెరవేర్చి కాలకృత్యముల వేగ
తరుణి కాఁచిన వరిగంజిఁ ద్రావి, యాలు
బిడ్డలను రామరక్షను బెట్టి, గోలు
కొండ కరుగుచు నిటు పాడుకొనె నతండు.

## —♦ పూరికల్యాణి-సంకీర్ణజాతి త్రిపుట ♦—

ప॥ శ్రీరామచంద్ర! నినునమ్మినాఁడర-నను బ్రోవ రార?
శ్రితజనపరిపాల! సుగుణమణిమాల-దయాలవాల! ॥శ్రీ॥

అ॥ ప॥ కారుణ్యామృతపూర! యఘవిదూర! రూపజితమార! స
మీరకుమారనత పా-దారవింద!-మృదువాఙ్మకరంద! ॥శ్రీ॥

(1) రాయినాతిగాఁజేసెద నీదప-రజమున-దీనబంధు!
అయువధికమై మనఁడకో-కాకాసురుఁడు-సత్కృపాసింధు
పాయక విభీషణుని-భాగధేయము మాపై-యేల లేద?
నాయగడుఁదీర్ప వేల?-దీక్షితపాల! యనాథనాథ ॥శ్రీ॥

సీ॥ ఆటనుండు విటనుండు వన్నిటనీవుందు
వెటనుండవొకట నిర్హేతుకముగ
అటియాదు విదియాదు వన్నియునీవౌదు
వెదియుఁగా వౌర! యూహింతు మేని
అణ్వాదిబ్రహ్మాండమంతట నీమాయ
కలదు, లేదను భ్రాంతిఁగలుగఁజేతు
చూపునీకందినఁ జూపులకందవు
అందుచు నీమనసయ్యె నేని.

గీ॥ అజరుఁడ, వనంతుఁడవు పరమాత్మనీవ
ధారుణీనాటికకు సూత్రధారివీవ
సుగుణమణిమాల! నన్నేలఁజూడవేల?
రమ్యగుణసాంద్ర! మాయయ్య రామచంద్ర!

ఉ॥ దారిఁబెక్కుగండములదాటుచు రామకృపావలంబియై
యాఱుదినాలు వేళకటు అన్నముపానములేక కాల్నడన్
జేరెనుగోలుకొండ, నవిశీర్ణమనంబున, నాతఁడంత ధం
కారవసంజ్ఞఁగేరుచు నెకాయెకిఁబోయి నవాబుకోటకున్

కం॥ తనపేరు మునికిఁబత్రం
బునవ్రాసి జవానుకిచ్చి పుత్తెంచెఁగచే
రినిమున్న మేనమామల
కనొసఁగు మిదియనుచుఁబల్కి గోపనవానిన్.

ఉ॥ అందినచీటిఁజూచుకొని, యక్కనమాదన లిర్వురవ్యయా
నందరసాభిషిక్తమనంబులతో నెదురేగి, మేనయ
ల్లుందమిఁ గౌఁగలించుచు. విలోకనముల్ కనవయ్యెనోయి! మీ
రందరునేమమే? సుఖులె అమ్మయునాన్నయటంచుఁ బ్రేముడిన్

గీ॥ మేలియుడుపులఁగట్టించి, మేనయల్లు
కేలుఁగొని వారు ఊని పేరోలగమ్ము
చేరఁజని రామదాసు నాసీనుఁజేసి
ఒక్కసోఫాను సంతోసముప్పతిల్ల.

కం॥ కరుణారసనాశ్రిత భూ
మిరుహాములఁ బ్రోదిసేయు మివ్వుల నెనరునఁ
గురిపించుచుఁ దానిష్ట భూ
సురుఁడా గోపన్న శంకఁ జూచియిటులనె.

—♦ వసంతి–చతురశ్రగతి ♦—

ప॥ వినఁదగునా తమదేయూరో, పృధ్వీసుర! తామెవ్వరివారో? ॥వి॥
అ॥ ప॥ ఘనవంశజులటులున్నారు, పేరున వర్ణము లెవి చెన్నారు ॥వి॥
(1) కలదెయుద్యోగమేమైన? మాతలఁచు కళాకుశలులు కాన
ఫలియించునె సస్యము బాగ? మీపొలము లెల్లెడ మహాభాగా! ॥వి॥
(2) ఏమిపనికిటుకుఁ దమరాక? కలకాలమితముఁ దెల్పెదరుగాక
సామి! సాత్త్వికము మీతీరుఁ గన-మామన మతులశుభముఁగోరు ॥వి॥

గీ॥ అనుచు మనసిచ్చి తనసేమ మడుగుతటి ని
జామునకు భక్తి మీర సలాముఁజేసి
రామదాసుండు తన చరిత్రమిటు విని చె
సభికులయెడందజాలి రాజ్యమ్మునేల.

మ॥ తమసర్కారున శంకితంబయి, సముద్యత్కీర్తి నొప్పారు గ్రా
మము నేలకొండ నివాసమ్మయ్య! గృహనామంబెన్నఁ గంచెర్లవా
రము; లింగన్న కుఁగామకాంబకును గారాబంపుపుత్రుండ నా
మముగోపన్న, కబీరుశిష్యుఁడను, రామస్వామికిన్ దాసుఁడన్.

గీ॥ మంత్రులిట మీకు మామేనమామలగుదు
రయ్య! తలిదండ్రులో కలసైరి నాకు
నేను విద్యాధికుండను గాను; డొక్క
శుద్ధి కలదింతె యింతో దాచుకొన నేల?

మ॥ పనికేమున్నది? రామచంద్రకరుణా ప్రాప్త్యర్థమాసించు చే
పని, శ్రీరాఘవదివ్యపాదకమలద్వంద్వార్చనాసక్తియే

పని, తత్తారకమంత్రరాజకృత తాత్పర్యానుమోదంబైనా
పని; లేదన్యము జీతబత్తెములుసంపాదింపఁగా నేలికా.

చ॥ కలుగురవంతయాస్తిఁ దనఖాదిగ్రమింగుట, నుంభవృత్తికే
మలవడినాము; మూగురము నాలునుబిడ్డయునేను; రామునే
వలకెదొ కానువీసమిడువాంఛజనించెడు దాతలున్నచోఁ
గొలుతుము దాస్యమైనఁ గడకున్ సహాయించి బిరానవారలన్.

ఉ॥ తిండియుబట్టఁగోరను సతీసుతపోషణఁజేసి; ముందు రా
ముం డటుపైన మే, మతనిపొట్టకుఁబట్టెడు నన్నమున్న మా
కుండినయట్లె; భోగములు, నుత్సవముల్ పయిమాట, యిప్పుడా!
«పిండికొలందిరొట్టె»గద! వింటిరె? నాస్థితియిద్ది భూవరా.

—♦ ద్విపద ♦—

అని నిరాడంబర-మా తనకధను
వినుపఁ జేఁడనె వెల్లి-విరియువాక్సుధను.

—♦ సరస్వతి-ఖండగతి ♦—

ప॥ భూదేవకులదీప!-బుధసమ్మతాలాప!
నీచుసచ్చరిత విన్న-నీసుగుణములఁగన్న ॥భూ॥

అ॥ ప॥ మోదఖేదములు న-మ్మము నాకుమది హెచ్చుఁ
గాదె మాయాజ్ఞమెలఁగు-నీదరిద్రతతొలఁగు ॥భూ॥

(1) రామునకు నునికి, భ-ద్రాద్రియంచు న్వనికి
కామితముతీరఁజనఁగా నీవ-క్కడకున్ తహసీల్ పనిగా
మాముద్రయు నిపాని-శోమించు హుకుముఁగొని
నీమమున నడుచుకొనుమా-సలామతుగామనుమ ॥భూ॥

ఉ॥ నీముకుటుంబపోషణకు, నీరఘురాముని సేవకెంతయున్
లేదన రెండువందలు కనీసముగానగు; వచ్చిపోవు వా

రాదరిణంబుఁబొందవలెనన్న మహేఁబదితప్పకందుచేఁ
గాదన, మాసవేతనముగాఁగొనుమా త్రిశతంబురూప్యముల్.

ఉ॥ రైతులమంచిచెడ్డలు నిరంతరమున్ గనుగొంచు, ధర్మదృ
గ్జాతకృపానురక్తి, సరసంబుగఁ బన్నువసూలుచేసి, నీ
వేతనమున్ మిగుల్చుకొని వెంటనె శేషముఁ బంపుచుండు మీ
నీతులునీకు నేర్పవలెనే? గుణసాగర! వేయిరీతులన్.

## — మంజరి—కురంజి —

అటులఁదన్నాదరించెడి తానాషా కంజలి ఘటియించి
పటుసంతోషముతోఁ గృతజ్ఞతా-భావము వెల్లడించి
కట్టిదరిద్ర తకున్ "విడాకుల-చట్టు" మనఁబొందెవాకుము
ఇట్టులమగుభక్తిఁ బ్రణుతించెఁదా-నినకులేశు నీవిధము.

## — జంఝూటి—ఆదితాళము —

ప॥ రామచంద్రరఘువీరా! నమోనమో-భూమిజాచిత్తచోరా! నమోనమో

అ॥ప॥ సామి! దశరధకుమారా! నమోనమో......రామచంద్రా! ॥రా॥

(1) దీనపాలనామోదా! నమోనమో-దివ్యలీలావినోదా! నమోనమో
మానితపవిత్రపాదా! నమోనమో.........రామచంద్రా! ॥రా॥

(2) నీలనీరదశ్యామా! నమోనమో-నిఖిలరాక్షసవిరామా! నమోనమో
పాలితాశ్రితస్తోమా! నమోనమో.........రామచంద్రా! ॥రా॥

(3) సాక్షిమాత్రప్రకాశా! నమోనమో-వీక్షణామృతనివేశా! నమోనమో
రక్షితదీక్షితదాసా! నమోనమో.........రామచంద్రా! ॥రా॥

శా॥ నేవాంఛిపను భాగ్యభోగ్యముల, నిన్నే నమ్మియున్నాఁడఁగా
నీ విత్తంబెది? నీకు వైభవము లెంతేఁగూర్పఁ; దల్లబికే
త్రోవన్ గానమి నీనవాబొసఁగునుద్యోగమ్ముఁ జేపట్టితిన్
"నావిష్ణుః పృథివీపతి" ప్రధ, యనన్యంబౌట నో రాఘవా॥

మ॥ మద మెచ్చింపకు మీమిషన్ దవిలి రామా? 'డబ్బుపాటిష్టి'; సం
పదకున్ దో, డధికార మొక్కటి, యహంభావమ్ము వాసింప నా
మదిఁ జోటీయకు, మీయనిన్నెపుడు నమ్మంబోను; నిన్ గూర్చి యే
కదయీపాట్లు; యశంబు దక్కునె? కృతఘ్నత్వంబు నూచించు చో

## —♦ మంజరి-కల్యాణి ♦—

నయవర్తనమున్ గోరి, రాముని మ-నంబున నటు ధ్యానించి
రయమున భూవరునాజ్ఞ నటను భా-ర్యాపుత్రులరప్పించి
వీడుకోలు సన్మానమిడు పెద్ద-పెద్దలన్ బ్రశంసించి
వేఁడుక నక్కన మాదవలయిఁట-విందుగుడిచి పయనించి
ఆడుగులకు మడుగులొగ్గు భటులు వెం-బడిరాఁ బహరానిచ్చి
అడవి తెన్నులన్ గోయలు సహాయ-పడ నెంతో బలిసివచ్చి
మును రాఘవుండు శ్రీమ్మరిన పుణ్య-భూములివియె కాఁబోలు
నని మ్రొక్కులిడుచుఁ మదను గౌతమీ-నదిఁజేరి మోచ్చికేలు.

## —♦ హంసధ్వని-రూపకము ♦—

ప॥ పరమపావని! గౌతమి! -దురితమడఁచి నను బ్రోవుమి ॥ప॥

అ॥ ప॥ కరుణామయి నిను నుతింపఁ-గలనె! జడమతిన్ దలంపఁ ॥ప॥

మి॥ హరిపదపద్మములఁ బుట్టు-వందుఁ ద్వన్మహత్త్వము మును
శిరమునని నీదాల్చె శూల-ధరుఁడు, వినా యెవఁ డెఱుగును? ॥ప॥

(1) చరితార్థవు నీవు రామ-చంద్రునకిక్కయో భద్ర
గిరితటంబు నంటిపారు-కీర్తి నీకఖండమది ॥ప॥
నిరతము నిను సేవించి, పు-నీతుఁడవగుటకున్ మంచి
తరుణము లభియించెనమ్మ-వరమతి వన్నెలకొమ్మ ॥ప॥

శా॥ నిత్యానందపదంబు స్వర్గమని, శాంతింబొందవచ్చోటఁ దా
మత్యాసక్తి బహుప్రయత్నములఁ జేయన్ జూతురెవ్వారు; సం
స్తుత్యంబయ్యది వీడి, సాగరులకుం దున్ దీర్చు నీవిట్లు స్వా
ర్థత్యాగంబున భూమిఁ జొచ్చు పరమార్థంబెంతునో గౌతమీ.

కం॥ తీరసిభక్తిన్ గౌతమి
నారీతిభజించి, తానమాడి, తరణిపైఁ
జేరుకొనెనంత తపసీ
ద్వారుఁడు భద్రాద్రిపురము దాశరథికృపన్.

ఉ॥ స్వాగతమిచ్చి మెచ్చు జనసంఘములన్ గని "పూజ్యులార! మీ
కేగతి నెంతురో తెలియదింతకు; భద్రనగంబు నేఁడు భూ
భాగమునన్ వికుంఠపదభాగ్యము; తత్పురవాసులౌటచే
భాగవతాగ్రగణ్యులనవచ్చు భవాదృశులెల్ల నమ్మఁడీ

చ॥ నడుఁకునడుండు ముందు రఘునాధుని దివ్యనికేతనంబుఁ జూ
పుఁడు, కుశలంబె వాఁడు? సుఖమోమన సీతమతల్లి? లక్ష్మణుం
డడరునె యొగ్గులేక? నిరతాశ్రయమౌ ప్రభుసేవ. నాంజనే
యుఁడెటులనుండె? నాతనిమహోత్సవ జన్మఫలంబలంతియే!

## —♦ భైరవి-ఆదితాళము ♦—

ప॥ గీతార్థముసంగీతార్థంబా-వాతాత్మజుసామ్మనమ్మ భగవ ॥గీ॥
అ॥ ప॥ సీతాపతిపాదార్చనఁదరించి-జీవన్ముక్తుండైన ఘనుఁడగుట ॥గీ॥
(1) అనవరత ముభయమతసమ్మత మం-త్రార్థమగు రామనామముజపించి
తనువుమఱచి యవ్యయానందమునఁ-దాండవించువిజ్ఞానధనుఁడౌట ॥గీ॥

మ॥ అనుచున్ వాయుజునుగ్గడించి, గొనబౌ నాసక్తి దేవాలయ
మ్మునకున్ బౌరులు దారిఁజూపఁజని, రామున్ బెన్నిధిన్ గన్నపే
దసుద్రోలన్ దరిసించి. బాష్పవిలసద్ధారాభిషేకంబు నా
తనిదివ్యాంఘ్రుల సంఘటించి యనువందన్ బాడెఁదానిక్రియన్

## —♦ కాఫీ-రూపకం ♦—

ప॥ సీతారకనామామృత-మేతీరులభించు రామ ॥సీ॥
అ॥ ప॥ చాతకమంబుదముఁగోరు-రీతి వేచియుంటిఁజూమా ॥సీ॥

మి॥ వాతాత్మజు నట్లింద్రియవశ్యు మెడసి, షట్ఛత్రు-
వ్రాతమ్మును గెల్చి "యహం బ్రహ్మాస్మి" పదమ్ముఁ గనక ॥సి॥

(1) ఈసున మతభేద మెంచి-యెంతో భక్తులటు నటించి
మోసకారులై జీవన్ముక్తిఁ గనని జడమతులకు ॥సి॥
వాసిగ క్షుద్రదేవతోపాసన మొనర్చి దీక్షిత
దాసావన! యిహసుఖమె సదా కోరెడి వెంగలులకు ॥సి॥

గీ॥ సాహుకార్లు, రసజ్ఞులు, సానితోడి
పొందునాదరింపఁ గోరు ముముక్షువులట
కీర్తిఁ గాంతురు రామనికేతనమున
ధర్మకర్తృత్వపదవి సోదరులిరువురు

కం॥ ఇచ్చినదిలేదు సరిపై
పెచ్చిఁక శ్రీరామచంద్రు పేరిట వార్వి
రిచ్చినయాస్తి దిందురు
మెచ్చవలదె? వారిధర్మమే ధర్మముగా

మ॥ తిరునాళ్ళయ్యెవి, ధర్మకర్తలిఁక సందేహింతురా? ముఖ్యమౌ
తరుణంబందున సానిమేళ మదిలేదా హాసుకాండ్రూరకుం
దురా? మర్యాదలుదక్కునా? తమకుకాదోలోటు? వేయేటి కా
ఖరుకున్ దేవుఁడె చిన్నబుచ్చుకొనఁడా? కార్యంబుగట్టెక్కునా?

గీ॥ కాన రామాలయమున నొక్కటఁ జెలంగు
పండిత విలాసపురుషు లానంద పార
వశ్యమున మెచ్చిమేలు వహ్వా యనంగ
మోజుగా జరుగుచుండెను మేజువాణి

గీ॥ కోవెలన్విడి, తనబసకుఁ జనువేళ
రామదాసును ధర్మకర్త,,లిదె మేళ
మరసిపొం''డని వేడ, గోపన్న యాట
వెలదులన్ గని జాలిమై పలికెనిట్లు.

## — యమునాకల్యాణి–మిశ్రగతి —

ప॥ సోదరీమణులార! మిముఁగన–ఖేదమయ్యెడు మానసంబున ॥సో॥

అ॥ ప॥ కాదనక వినుఁడింపుసత్యము–గౌరవంబున మనుటగత్యము ॥సో॥

మి॥ ఆదరించు ప్రభులు లేర? వి–ద్యాధికత్వఁ దగుఫలము లేర!
సోదరుమఁడు మీహీనవృత్తిఁ–బోరున సంస్కారధ్వజమెత్తి ॥సో॥

(1) స్త్రీయశంబును వ్రాయు ఢంకా–శీలమొక టెయనంగ శంకా
సేయునేటికి అదియె పురుషుని–వేసటన్ దీర్పఁగలపంకా ॥సో॥
మాయునె మానవతిచరితముఁ–నేయుగమ్ములనైనన్ జకచక
వ్రాయకున్న తిరుగఁబోడి కవి–వర్యుఁడెద్ది కొలుపఁ గ్రొత్తచవి ॥సో॥

చ॥ ధనముగడింప మానపరిదానమొసంగుటకన్న హీనపా
ధన మెదికలు? వారవనితామణి పుణ్యవధూపదంబునం
దినఁగడు పాశఁ దిండిఁదిన నేరద? ఆలికిఁ గూడుఁబెట్టఁజా
[illegible]జడుఁడెవ్వఁడుండు? నవురా! కలికాలపు వైపరీత్యముల్

ఉ॥ కాలము మారె, దుష్టవిటకంటకముల్ మితిమీరెఁ బ్రాయపుం
బాళ్ళము జార మీ బ్రదుకు భాగ్యపదంబునఁ దాఱె; నీతియే
మూలనొదూరె, సంస్కరణముల్ తమకత్తులనూరె, నక్కటా
మేళములింకనైన విరమించి సుఖింపుఁడు సోదరీమణుల్.

## — మంజరి–మోహన —

నీతిబోధనటు రోచెలు లజ్ఞాన–నేత్రముల్ విప్పఁజాలి
పూతచిత్తుఁడై యిటు సేరె ధర్మ–బుద్ధి నానుగుణశాలి
రాము సేవలకుఁబోడు రాజకా–ర్యములఁగూడఁ దనకున్న
సామర్థ్యంబును జాటుచుండె బుధ–సమ్మతుఁడై గోపన్న.

చ॥ పరమతమన్నఁ జూపఁడు విపర్యయభావము, లంచగొండియై
కరణము నెత్తిఁగొట్టఁ డటు కాలను రాయఁడు రైతువర్గముల్.

మతివినఁబోఁడు కొండెములమారినుడుల్, కడుసొంతసంబునన్
దొరతనమిచ్చు చేతనముతోఁ బరితృప్తి వహించు నాతఁడున్.

గీ॥ తనకు సర్కారొసంగెడు దారిబత్తె
మునకు ఘోషాలనొదుగు శాసనమొనర్చి
వడవయజమానులన్ బందివాళ్ళఁబోటఁ
గొట్టి యుచితప్రయాణముఁగోరఁ డతఁడు.

కం॥ తాలూకాలోఁగల కర
ణాలను మునసబుల నొక్కనాఁ డాతఁడు పే
రోలగముఁగూడఁ బిలుచుచు
నీలీలవచించె మోసులెత్త వినయమున్.

## —♦ బేగడ-చతురశ్రగతి ♦—

ప॥ అన్నలార! నాసేయువిన్నపం-బవధరింపుఁడొకమాట ॥న॥

అ॥ ప॥ కన్నతండ్రులై బిడ్డలటు సేద్య-గాండ్రనేలవలె మీ ॥ర॥

మి॥ మన్ననలతోడ నవాబుకడ నా-మాటఁదక్కింప నొకరోజుమందు
పన్నులువసూలుఁజేసిపంపు నే-ర్పరితనముఁజూపమిము మెచ్చుకొం॥ద

(1) రామభక్తి భవముక్తికేర్పడిన-రాజబాటకద వినుఁడీ
వ్యామోహంబులఁజిక్కక తత్ప్రభు-వర్యుకృప పొయిమనుఁడీ
కామితములతో మాయమూల్యమా-కాలమున్ రిత్తగాఁగడుపఁబోక
రామకోటిరచియించి జన్మసా-ర్ధకతఁబొంది తరియించెదరుగాక॥అ॥

సీ॥ దేశికబ్రహ్మోపదేశమున్ దనసాటి
రానట్టి మేటి శ్రీరామకోటి
ప్రవిమలజ్ఞాన ధూర్వహులఁ జిదానంద
రతిఁదేల్చుజోటి శ్రీరామకోటి
దారిద్ర్యకలితసంతాపమెంతయుఁ బాపు
రతనాలపేటి శ్రీరామకోటి

రమణీయమోక్ష సామ్రాజ్యమాశ్రితులఁ జే
ర్పఁగఁ దుదిచీటి శ్రీరామకోటి.

గీ॥ బళిరె! యేతాదృశపరిభావమున నలరు
రామకోటిరచించి, తారకమహత్వ
సిద్ధిఁదరియింపఁడయ్యె ప్రసిద్ధిమీర
సారమతులార! గ్రామాధికారులార!!

ఉ॥ కంటిరె రామునాలయ మొకండును నక్కట యిట్టిదుస్థితిన్
మంటినిఁగూలుచుండ నవమానముకాదె? పవిత్రచిత్తులై
యుంటకు మీమనంబు లెటులొప్పెను! నాకిపు డూతనిల్చి మే
ముంటిమనుండుచాలుఁ బునరుద్ధరణంబొనరింతు నెట్టులో.

మ॥ వినియేయుందురుమీరు పూర్వకథ, నిప్పిటన్ మహాభక్తురా
లని కీర్తిన్ వహించి రాఘవు ననుజ్ఞాప్తిఁ గట్టించె దీ
నిని "దమ్మక్క" ధనప్రదాతలగు మన్ని లెందరో సాయమా
మన్, నేడియ్యదికూలుచుండనొరకాటంబొందబోఁడొక్కఁడున్

మ॥ ఇడఁబోనియ్యదె దీక్షఁబూనితిని; నిర్విఘ్నంబుగాఁ గార్యమే
ర్పడసాధించెదఁ, గష్టనిష్ఠురము లెవ్వాటన్ విజృంభించినన్
దడఁబాటొందను, రాముఁడేగలఁడు, చూదామెందుచేఁగాదొ! మీ
రుడుతాభక్తినిఁ గూర్చి తెండిటకు నింతో, యంతొ, సద్భావులై.

## సావేరి—రూపకము

ప॥ పోవునపుడు వెంట గడ్డి-పోచయైనరాదు ॥పో॥

అ॥ ఈ॥ భావింపఁగజ్ఞానికిఁ దా-పత్రియంబె చేసు ॥పో॥

మి॥ ఈవిధి నాభార్యయిద్ది,-నావిత్తము నాకొడుకని
దేవులాట పునర్జన్మ-కైవసమొనర్చుకొను బాట ॥పో॥

(1) కూడఁబెట్టుపుణ్యమొకటె-తోడునీడ మనకు
వీడను మృత్యువా! మనల-నేడొ రేపో చెనకు

పాడిసెదక రామునిపద-పంకజయుగమూతఁగొనుం
డీడ దీపముండఁగనే-యిలుఁజక్కదిద్దుకొనఁజనుఁడు ॥పో॥

ఉ॥ కన్నులపండువయ్యెఁ ద్రుటికాలమునిల్వని యింద్రచాపమే
తెన్నున మాయమైచను, నదేక్రియ నేర్పున రెప్పపాటులో
వన్నెలు చిన్నెలెన్నొ కనఁబర్చి, యశాశ్వతమైనకల్మి, తా
నున్నటులుండి దాటునెటకో మనయాసల నీసడించుచున్.

వ॥ అవధరింపుఁడట్లు-నిష్కామయోగోపన్యాసధోరణిన్-శ్రోతల బుజ
మార్గప్రవర్తకులఁజేసి-రామాలయపునరుద్ధరణదీక్షన్ బద్ధకంకణుండై
మోక్షమార్గనిరోధకంబులుగాని, గుప్తదానంబుల స్వీకరింపుచు-భక్తి
రసానుకూలంబున జానపదులొసంగు నల్పవిరాళంబులఁ ద్రుణీకరిం
పక-కృతజ్ఞతాపూర్వకంబుగ నందుకొనుచు - నొకశుభముహూర్తం
బున-శంఖుస్థాపనమొనర్చి-పునీతమంత్రరాజిన్ బాలితంబై, యంత్ర
బద్ధంబగు మూలవిరాట్ప్రతిష్ఠ జోలిఁబోక-తక్కుకర్జంబులఁదీర్ప నిశ్చ
యించి-తమకిట్టుబాటున కినుమడంగులఁ గార్యసా[illegible]న్ బ్రవ
ర్తించు మేస్త్రిల నియమించి-వలయుసామగ్రి య[illegible]బాటులోనుం
డునట్లు కట్టుదిట్టంబుల నెరపుచున్నంత-గౌతమీనదీతీరంబున నెయ్యె
డఁ బరికింపుఁడు జాలనిండునౌకలే!-ఎచ్చోటఁజూడుఁడు. దారునిచ
య పరిపూర్ణజలయానంబులే!- నిమసమాగుఁడు-చక్రికిరీటౌన్నత్యం
బున, గగనప్రతిరుద్ధదినేశమార్గమై-యపరంజిమైపూతన్- దళుక్కునే
గ్గులఁ గ్రుమ్మరించుచు-గాలితాకున నూగాడు చిఱుగంటలసవ్వడిన్-
మనల స్వాగతగీతమ్ముల నాహ్వానించుచున్న దదినూత్న ధ్వజస్తంభం
బుకాఁబోలు!-నదుండటు నేమివిశేషములఁగందుమో!-ఆశ్చర్యమాశ్చ
ర్యము!-నిన్నటి కలగజమైన లేవనియీప్రాకారం బింతలో నింతయెత్తు
పెరిగిన దీపని వాండ్రింద్రజాలికులో యనువారును-జాగ్రత్తగ సోపా
నముల లెక్కించుకొనుచు రం, డిది .చిత్రకూటాఖ్యన్నగడు దేవ
స్థానకార్యాలయమనువారును-చూడుండిల్లిదే గోపురసింహద్వారము
దీని నతిక్రమింప, నదో-సుదర్శనమౌళిన్ జొరయు రామాలయము-ఆ
ద్దానిఁ జుట్టిరాఁజూపట్టు విశాలప్రదేశమున కిరుగెలంకులఁగల విలాస
మంటపంబులనఁటి నెలకొన్నవి పన్నిద్రాళ్వారుల నికేతనంబులా?

సరిసరి!-ప్రదక్షిణమాచరించితి, మిఁక దేవదర్శన మొనరింత-మిప్పుడు మనముచేరుకొన్నది ముఖమండపము-దీనిన్ దాట నంతరాళిక, మా పైన గర్భాలయమను వారును-సార్థక జన్ముల మైతిమావో!-శ్రీరామచం ద్రుండదే-ధృవకౌతుకోత్సవస్నపన బేరంబుల-నర్చావతారరూపుం డై, యెటుల కనుపండువొనఁగూర్చుచున్నాఁడో! యని, భక్తిభావం బుట్టిపడ, సాష్టాంగదండప్రణామమాచరించి లేచి తీర్థప్రసాదంబు లందుకొనువారును-స్వామీ! అదియా పచ్చలపతకం, బిదియా ము త్యాలహారంబని-వివిధాభరణక్రమంబర్చకులనడిగి తెలిసికొని-యానం దపారవశ్యమున మైమఱచువారును-ఈప్రక్క రామునకుఁ బలుఁ దోము జాకొట్టు-మాచక్కి సీతారాములు పవ్వళించు పర్యంకాగార మేమి వైభవము! భద్రాద్రి కలియుగవైకుంఠమాయె నేఁటికని, మోద బాష్పము లొలికించువారును-వీక్షింపుఁడాదెసఁ దిరుకంటపల్లి చే రువ సాగంతకులకు విడిది-ఈతావునఁ బుష్పోద్యానము-బళిరా! కో నాన్నో రాఘవుని తేరు, గరుడవాహనము, చల్వచప్పరమ్ము-లెడతె గని [illegible] మూల్యవస్తుసందర్శనమ్మున, కీరెండుకండ్లు చాలకున్న వే!-ఈమం[illegible]లాధికారి సాక్షాదవతారపూరుషుండు, మునుముందు గాని, సామాన్యమానవుఁడా? యని మెచ్చుకొనువారును, మొదలు గాఁగల-జనతండంబుల పొగడ్తలకలరక-గోపన్న సఫలీకృతమనో రథుండై-తత్క్రియాచరణావేశంబున-సర్కారు పైకమాటుంటు రాష్ట్ర మెచ్చించిన నిజస్వాతంత్ర్యమున కరవాయిఁగొనక-ఇష్టదైవాముగ్రి హామాసించి-లెక్కకుమిక్కుటమ్ముగు సమారాధన లొనరించుచుండ.

చ॥ పలుకరముల్ పదార్థములఁ బండినచేలటు నిండి, కమ్మతా
వుల వెదఁజల్లు విసరులపోడిమి తృప్తి రితాపమార్చు నె
చ్చెలిగతి భోక్త లెంచి పరిషేచనఁజేసెడివేళ, న[illegible]
గలిగె విపత్తొకండు, పరికల్పిత దైవపరీక్షయో యన[illegible].

గీ॥ తోడిబుడుతలఁగూడి, యాటాడుకొనుచు
రభసవృత్తినకట రఘురాముఁడాత్మ
కర్మవశమున నొకవేడి గంజిగుంటఁ
బడియెఁ బడుటయె తడవుగ విడిచెనుసురు.

గీ॥ తల్లికన్నవఁ గుఱ్ఱమెన్నిదాఁగుణంబు
కాని, పతిచేయుసత్కార్యహానికడలి
పొంగిపొరలెడు దుఃఖ మాపుకొనియొకట
మరుగుపఱచెను తచ్ఛవమానుశీల.

చ॥ కడుకడి వృత్తలం బదరఁగాఁజను సూర్యుపరాగమందు తా
నడఁగుచు దాఁడుఁదీయు నసహాయవిషాదజవాళ్వ మోసరి
ల్లెడుగతిఁ దోఁచదే! నిలువరింపఁగ నోరిమిపేరివాగె యా
బిడ కరసంగతంబయి నిపీడితమైన నదేమిచిత్రమో.

గీ॥ భోక్తృభోజననాటకమ్మునకు భరత
వాక్యమనఁజెల్లి, త్రేన్పుసవ్వడులఁగలసి
వినఁబడెను „రామారమణగోవిందహరి'' య
టన్న గంభీరఘోష మాశాంతమగుచు.

గీ॥ ముగిసెశుభరూపకమ్మటు భోక్తలలర
సుతవియోగార్తి రామదాసునిపడంతి
నాందివాచకము విషాదనాటికకు ను
పక్రమించెను జాలు నీర్వారనిట్లు.

—♦ సారమతి-చతురశ్రగతి ♦—

ప॥ కనుగొనవేల? కమనీయఫాల-యనుపమశీల! వినయాలవాల ॥క॥

అ॥ ప॥ జననీజనకుల మనములురంజిల-నినుగాంచినఫలమును నిడుధీబల॥క

(1) కోమలగాత్ర! కువలయనేత్ర!-మామకపుత్ర! తామసజైత్ర
కామించెనేకలి? రాముఁడునరబలి-తామసమునఁదొలినిమముగాఁజెలి॥క

సీ॥ జిలిబిలిపలుకుతేనెల నొలికించు వా
తెఱ క్రొవ్విరుల కుపదేష్టగాఁగ
సాత్త్వికతేజఃప్రసారసారాంచిత
నయనముల్ తబనిమన్నవలనంద

రఘురామవిగ్రహారాధనాకర కర
ద్వయినాస్తికాళి సంభ్రమమడంప
చిఱుకుఁదనాన క్రీళ్ళు ఱుకుపదములు మృ
గార్భకమ్ములకు నాట్యకళ నేర్పు.

గీ॥ నిందిధనువునుబోలి నీవిన్నివన్నె
లిన్నిచిన్నెలఁజూపి, యెందేండ్లలోనె
కడుపుకొంటివె నూరేండ్లగడువుతండ్రి!
కనెదె రిక్కలనక్కి దిక్కతినమమ్మ?

గీ॥ కడుపుచిచ్చిడిపోతివె కన్నకొడుక
పలుక వేమని గుండెలుబాదుకొనుచు
గోడుగోడున నేడ్చు నాకోమలిఁగని
పలికెనూరటఁగూర్పు గోపన్నయిట్లు.

మ॥ విలపింపన్ ఫలమేమి జాల్గరఁగఁ దన్వీ! దిక్కు శ్రీరాముఁడే
కలఁడన్నింటికి, నమ్మెమెన్నటికి, వేగన్ లెమ్మ, రారమ్మ, కో
వెలకుంబోదము; వానిముందిడి సుత ప్రేతమ్మ ''ఏపాట్లు రా
వలె నేమా''కని మొఱ్ఱఁబెట్టుకొనఁజూపంబోదె మోమోటమిక్?

## —♦ మంజరి—కన్నడ ♦—

అతులధైర్యమున నాభాగవతుం-డంగన వటులోదార్చి
మృతకళేబరము రామునిపాద-ద్వితయసన్నిధిన్ జేర్చి
తారకనామపునశ్చరణంబునఁ-దన్మయత్వముగాంచి
తేరుకొనిమఱల ప్రార్థించెనిట్లు-దీనత నాదలవంచి.

## —♦ కదనకుతూహలం—చతురశ్రగతి ♦—

పల్లవి. చలమేలఁజేసేవయ్యారామ!-సాకేతధామ సత్సార్వభౌమ ॥చ॥

అ॥ప॥ కులదీపకుండగునొక్కసుతుఁ-బాలియింపన్యాయమా!క్షమ్యాబామా॥చ

(1) నినునమ్మికొల్చినదానికీ-యనుభవమ్మెఫలమౌనా! జ్ఞానాధీన!
దనుజారి! నీసేవను వీనినిల్పు-కొనవేమి? దీవెననోమి, సామీ! ॥చ॥

శా॥ మాయాతీతుఁడ వీ, వసాధ్యమెది రామా! నీకు? మున్నొక్క-లేఁ
బ్రాయంపుంబుడుతం డయోధ్యవిగతప్రాణుండుగాఁగుయ్యెమొ
ఱ్ఱో, యంచుఁ విలపించు తజ్జనకుఁడెంతో మోదముంజెంద నాఁ
డాయుర్దానమొసంగి ప్రోచితివి కాదా! వానిధర్మార్థిపై.

గీ॥ అద్దికల్పితగాథయో!, అసలునిజమొ!
నిర్ణయింపఁగఁజాల; దానినిపుడీవు
సత్యమని బుజువుసేయఁగా శక్తియున్న
నేదిచూతము బ్రదికించు మీకుమారు.

కం॥ అనివేడుట తడవుగ రా
మునిమహిమంబేమొ నిదురఁబోయి మేలకువఁ
గనురీతి లేచెగోపన
తనయుఁడు చూపఱకు నద్భుతంబుఘటిల్లన్

గీ॥ గురుదశతోలంగెనిఁక శనైశ్చరుఁడు తనత
డాకఁజూపింపఁదొడఁగె ననేకగతుల
రామదాసునకున్ మేనమామలిట్లు
వ్రాసిరొకజాబు తిరుగజవాబుఁగోరి.

—♦ కన్నడదర్బారు-త్రిశ్రిజాతిత్రిపుట ♦—

ప॥ వింటివా? నీభావిసౌఖ్యము-విషయమించుక యోచించుచుంటివ ॥విం॥
అ॥ప॥ బంటుతనమున నైజామ్ పైకముఁ-బంపఁబోవిదిన్యాయమంటివ? ॥విం
మి॥ తొంటినీమగౌరవమునిల్పు-కొంట కిపుడైన వేగిరపడు
తంటాల్వచ్చిలేకున్న నినుఁ-దానీషా యుపేక్షాదృష్టివిడఁడు ॥విం॥

(1) ఎన్ని పాకులఁబన్ని చెప్పుచు-నున్న తేఁడొకకన్న నీపయి
మాన్నె యుంచుట దానఫలితం-బున్నచిన్నె లుతోచకున్నవి

క్రన్నన నేమేలో? యొక్క పత్రము కన్న గడున్నలేదు సరుకొనఁ
జిన్న మొత్తముకో? యూటుంటత్స లన్న, మాకు జవాబు జరూరి గోపన్న॥వి॥

గీ॥ పిడుగు మొత్తమ్ములనఁగఁ దోఁచెడు విశేష
ములతోఁడాదిగు నాకమ్మఁ గలయఁజూచి
తెలుపుఁబొందక గుండె దబ్బరముతోడ
వ్రాసెఁబ్రత్యుత్తరము రామదాసుఁడిట్లు

సీ॥ గుడికిఁగట్టైన మికులక్కలేదు నే
నాటులత్సలపైకమంటు నిజము
హిందువులైన తానీషా మెచ్చకుండురా?
మనరామచంద్రుని మనరఁగోరి
గుళ్ళుగోపురములు, గురుతరమంటప
ప్రాకారములు వస్తువాహనమ్ము
లేర్పాటుచేయ వ్యయించితినది, యింక
కలుఁగఁబోదు సుబారా ఖర్చేకండు.

గీ॥ నమ్మకుంటేరో లేదో మీరలింతకును వచ్చి
చూడవలెఁగాని నేఁజెప్పఁబోడిగాను
నేఁడు భద్రాచలంబు సందేహమేమి?
కలియుగవికుంఠమే యన్నగలయుఁగాదె?

మ॥ ఒకమా టెట్టులో వీలుచేసుకొనిరం, డున్నంతకున్ దీరబో
విఁక కార్యంబులు; దానికేమిసరి, తామేతెంచుచో తీనిఁద
ప్పకఁ దోడ్తెత్తురు కాదె యియ్యెడకు నేఁ బ్రార్థించినానంచు వా
రికి ముఖ్యంబుగఁ జెప్పి నాకు మఱి మీరే పెద్దలన్నింటికిన్.

అనుచు లేఖను ముగియించి యంపదానిఁ
జదివిమంత్రులు సంభ్రమాశ్చర్యచకితు
లగుచుఁదెలిపిరి, తమకు వేఱుగతిలేమి
కల తెఱఁగు తానీతోడ నూర్పులనిగిడ్చి.

—♦ మంజరి-అఠాణా ♦—

అవ్వార్త(గినిసి నవాబు తనసా-మ్యాకృతి(ద్రుటిలో మార్చి
దివ్వతోమిడుతకొటలా? అరే-దివానా! యనుచునార్చి
,,రామదాసు నిటకీడ్చి తెందు హ-ర్కా-రులార! మీరే(గి
తామసమున నెటులున్న వానినటు-తన్నిరా(డొపడలాగి
పొం''డనుచుమోము కెంపుగదుర బొమ-ముడిపాటునముదలిడ(గ
గండు మిగిలి వారట(జేరుచు నా-గ్రహావాజులపై వడిగ.

శా॥ పో(గాలం బదియేమొ! తద్భటులు తప్పొప్పియొప్పొయోజింప,క
ట్లాగారంబును జుట్టుముట్టుచు, నిజామాజ్ఞన్వినంబల్కి— ,,రే
బేగీఅవరె! బొమ్మ్ర''నంచు మిగులన్ బీడించుచో రామదా
సాగుండొక్క-క్షణంబు నాకు గడువీయ(గా జెల్లునం చత్తరిన్.

గీ॥ విచ్చుకత్తుల( బహరాలనిచ్చి భటులు
తన్ను వెన్నంటిరా, రామసన్నిధాన
మునకు(జని వానియడు(గుదమ్ములకు( దనివి
సనగ (మ్రొక్కుచు వేడె నంజలిఘటించి.

—♦ కామవర్ధని-చతురశ్రగతి ♦—

స॥ నీమహిమ బ్రహ్మదులున్ దెలియ-నేర,రే నెంతవా(డరా రామ ॥నీ॥
అ॥ప॥కోమలాంగ!త్వత్సంకల్ప మేది-యో మేలుకొలుకొ కాదెగుణధామ॥నీ
(1)దయయుంచుముపోయివత్తు(ద్వరనీ-దర్శనభాగ్యముమరల(గలిగించు
భయమేటికి?నీవండనిల్చి కా-పాడుచుండ నన్నెవ(డు వెఱపించు॥నీ
(2) పాలముంచు, నీటముంచు,-నేనీ-పాల(బడితి(గద జానకీరమణ!
కేలుమోడ్చిపరుల వేడ(జాలి నా-కీర్త్యపకీర్తులునీవె భవతరణ! ॥నీ॥

ఉ॥ కష్ట మేయనుము రాఘవ! తప్పదింక నీ
వటనిట మా సేమ మరయుమయ్య

మత్కి, శెట్టిబోగులమనిషి యిల్లా, లింట
నాడతోడుగ నుండుమమ్మ సీత!
తరిఫీదుచేయు మెంతయురామభక్తి, మా
చిన్నిబిడ్డను హనుమన్న! నీవు
ఆలయంబున లక్ష్మణా! లోటుపాట్లేమి
రానీకఁ జూచు భారంబునీది.

గీ॥ మగిడివత్తునో, లేదొ, యేపగిది తోఁడు
దండనవిధించునో తోఁచకుండెఁగాని
యేదియైన, మాకాప్తహితులు మీరె
సెలవుదయ సేయుఁడింక నిశ్చింతఁబోదు.

— ద్విపద —

అని వేడునంతలో-నా లటవచ్చి
కనులనీర్వదగాఁ-గని శోకమెచ్చి

— పున్నాగతోడి-మిశ్రగతి —

ప॥ జీవితేశ! సైచుటెట్లు? దైవ-మీవిధిఁగూర్పనికట్లు
అ॥ ప॥ రావణారిపదరాజీవ సేవనిన్-గావఁజాలదేమికర్మమో నా సామి॥జీ
మి॥ తావకీనవియోగజలధిఁ-ద్రోవఁగన కల్లాడుమని విధి
భావించి నాముఖమునన్ మ్రాఁదు-పంక్తులన్ లిఖియించెనా నేఁడు॥జీ
(1) ఎట్టియిడుములఁబెట్టనుండెనో, తానిషా-కెంతక్రోధముమదినిండెనో
కట్టా, కనికరమింతచూపునా? నాకుఁ-గలపరితాపముఁ బాపునా?
పట్టుదల తనకేమో? కాకీ-పెక్కమగునో కో పెద్దబాకీ
రట్టురవ్వలకొఱకె గాసి-పొట్టకని తిట్టిమా పోసి॥జీ
చ॥ అనిదురపిల్లు నాలిఁగని ఆంగన! చూడు నదీప్రవాహమం
దునఁబడిపోవు కట్టియలతో సరిపోల్పఁగవచ్చుకాదె? యీ
మనుగడజీవసంతతిః రమాపతి సత్కృపఁబాని క్రిమ్మఱన్
జనులనుగల్పునేమొ! ధృతిమాలకు మీగతి శేలవైకదన్.

గీ॥ కలికి! నేనెట్టులకట, రాఘవవియోగ
కష్టమిప్పుడు సహియింపఁగలిగినానొ
అటులె నాతోడియెడఁబాటు నెటులొ సైచి
యుండవలె నీవు, దారిమఱొండులేదు.

చ॥ మధుకరవృత్తితో మనుఁడు: మానిని! నీవును బిడ్డఁడిప్పుడే
విధమునసైన లోటుకనిపింపదు, గ్రామముచాలమంచి, దిం
దధమము రెండుపొట్టలకు నన్నము పుట్టకపోదు, రామస
త్కథనిరతంబుఁబాడుకొని కాలము హాయిగ వెళ్ళబుచ్చుఁడీ.

చ॥ ఇఁకపయి ఖర్చుమాట వచియింపఁగ నేటికి? మేనువంచి, తీ
రికగలవేళ చేతనగురీతినిఁ దీయుమునూలు; దాని బా
లకుఁడెట్లొయమ్మి తెచ్చును వెలన్; నిరుపేదలగోడునార్చి తీ
ర్చుకొలఁకు కల్పవృక్షమనుచున్ మురుపెద్దలు రాట్నదేవతన్.

—♦ కాంభోజి-రూపకము ♦—

ప॥ చేరరమ్మా రఘురామా-శ్లేషణసౌఖ్యమునిమ్మా ॥చే॥

అ॥ ప॥ కూరిమి నినుఁగన్న జనకు-కొలఁకు మదిని బెంగటిలకు ॥చే॥

(1) అవినీతులఁగూడి చెడకు-మఘకూపములోనఁ బడకు
భవహారమగునీకు రామ-పాదార్చన మఱవఁబోకు ॥చే॥

సీ॥ హరి, విశ్వమయుఁడని నిరతముతండ్రితో
వాదించిగెలుచు ప్రహ్లాదుచరిత
ఆహారమాఘటిత లింగార్చనావిధి మిత్తి
పాలఁదప్పు మృకండసూతిచరిత
దృఢతరసత్తపోదీక్ష సాక్షాద్రమా
ధవుని దర్శించిన ధ్రువునిచరిత
కాజన్మవిడి నటరాజదేవుని సైక్య
మందవేర్చిన నందనారుచరిత.

గీ॥ పెక్కుమారులువింటివో బిడ్డ! వారు
బాలభక్తులు, తద్భక్తిభావమీవు
కైవసమొనర్చుకొనువాంఛఁగలిగి మెలఁగ
నిన్నుదీవింతు నెచ్చటనున్న సరియె.

—♦ మంజరి–భైరవి ♦—

అనుచు సతీసుతులకుహితముఁబల్కి-హర్కారులవెనువెంట
జనుచుండ జనులశ్రునేత్రంబులఁ-గొనునకొనియె జాలిపంట
పుత్రశోకబుద్ధిగా ననుకొనిరిటు-పురప్రజలు గుమిఁగూడి
పెట్టెముట్టెకూఁతలతో వెంబడి-విత్తులంచు శివమాడి.

గీ॥ మనుజుఁడై పుట్టినందు కీమాత్రమైన
స్వేచ్ఛలేదొకో? గోపన్న చేసినపని
స్వార్థమాసించి కాదు; నవాబధర్మ
పరుఁడు నిశ్చయమని యతివాదులనిరి.

గీ॥ ధర్మకార్యమె కాని, యింతకునిజాము
సెలవులేకయె సొమ్మువెచ్చించె రామ
దాసుఁడది గొప్పతప్పుకాదా? యిఁకౌన
వా బనుగ్రహమని మితవాదులనిరి.

గీ॥ రామదాసునితప్పున, రానవాబు
దూరదృష్టినివీడి దుందుడుకుఁజూపఁ
దగదన రదేమొ! మౌనముద్రనుధరించి
చూతురు తటస్థులచలవిఖ్యాతిఁదనరి.

—♦ వెంబడివిత్తులు. ♦—

ఉ॥ గుళ్ళుష! గోపురంబులష! గుడ్డష! కూసష! అబ్బా! ,,ఆత్తసొ
మ్మల్లుఁడు ధారవోసెనష! అందరుభక్తులె! మోసమెన్నఁడుక్
వెల్లడికాకపోదుసుఁడి, వెన్కనె మేమనుకొంటి, మేదియో
అల్లరివచ్చుఁదప్పదని; ఆటు ,ల' కారములన్న! మాటలా!

## మంజరి—కన్నడ

కాలినడకభయదారణ్యములటు-కడచిపదునైదునాళ్ళ
గోలుకొండ గోపన్న చేరెకడ-కుఁ నొవ్వఁగఁదనకాళ్ళ
భటులాతని నిర్దయఁదోడ్కొని తెచ్చి-ప్రభునికట్టెదుటనిలుప
గటములదరఁగని తానీషాయిటు-గర్జించె జెలఁగఁగోలుప

## అఠాణా—రూపకము

ప॥ ఏరయింతదుర్బుద్ధి య-దేలపుట్టెనీకు? తులువ! ॥ఏ॥
అ॥ ప॥ ధీరత మము మోసగించు-తెలివికబ్బఁగలదువిలువ ॥ఏ॥
చ॥ కారుణ్యమువీర గుడ్డి-గవ్వకైనమారని నిను
చేరఁదీయఁబరమార్థం-బీరీతిని మాకుదక్కె ॥ఏ॥
(1) అటులక్షలపైకము నీ-యబ్బసొమ్ములైయని తింటివ?
వోరుచచ్చి తానీషా-యూరకుండుననుకొంటివ? ॥యే॥
ఆరాలన్నియుఁ దీసి-తీరెద, బందోబస్తు
జారీచేయింతుహుకుము-జప్తుగనీయావదాస్తి ॥యే॥

ఉ॥ మ్రుచ్చఁదనంబుకొన్నడమి మోసముఁజెందితి, నాఁడు నీదు ని
పచ్చరమార్పజాలిఁగొని; బాపఁడ! వింటివె? పేనుపెత్తనం
బిచ్చిన నేమొంచేసెనట! యింతకు నీతలవ్రాత తప్పునే?
రచ్చకునీడ్వఁగాఁబడి, పరాభవమొందుచునుంటి వీక్రియన్.

ఉ॥ బొక్కసమున్ లక్షలకు బొక్కియపెట్టిన సాహసంబు, నీ
కెక్కడనుండివచ్చె? సరి, యీపయి నీపడుపాట్లుచూడు మా
కుక్కలునక్కలైనఁ గడకుఁ బడఁబోవిది నిక్కవార! యో
తొక్కలికాఁడ! నేఁజెఱవిధించెద నీమనియుండు నంతకున్.
కం॥ అనిక్రోధమ్మున నార్చెడు
తనసేనికిఁబ్రొక్కి, రామదాసుఁడు మిగులన్
వినయమ్మెగసర, నిటు భీ
తినిఁబొందక, తెగువఁబూని తెలియఁగఁబలికెన్.

# భక్త రామదాసు.

## —♦ తోడి-ఖండగతి ♦—

ప॥ మనవిఁజేకొను టేఁడ-కినియక్షము నీవాఁడ ॥మ॥

అ॥ ప॥ ధనము నాదనఁబోను-దాపరిఁడను గాను ॥మ॥

చ॥ మును సిరిమూటఁగట్టు-కొనిచనిరె యేరైన?
నినుబోఁటికి నాబోటి-ధనమొకొ? మనిషివికాన ॥మ॥

(1) అటులక్షలవరా-లప్పుతీర్చెడిదొరా
శ్రీరాముఁడే కాని-నేరనే భూజాని ॥మ॥
పారమార్థికంబును-గోరి చేసినపనికి
కారాగారము నేఁ-జేరఁదగిన యునికి ॥మ॥

ఉ॥ మీకును నాకు, నమ్మఁదగు మిత్రుఁడు, రాముని బాగుగోరి యా
నైకము వెచ్చపెట్టితి, నవాబుల యేల్బడిఁ జిక్కి, బీదవాఁ
డైకను పట్టు దేవుఁడొకడక్కట చిన్నతనంబు కాదె? మీ
దైకద దీనసత్ఫలిత మింతకు నాపయి నిందయేటికిన్.

ఉ॥ ఓకమనీయవిగ్రహా! మదార్జితపుణ్యఫలంబుఁ జేసి యే
నాకిటు సావకాశము ఘనంబయె రామునిసంస్మరింప; ము
క్కాకలుతీరి గర్భనరకంబను బందిగమంమ్ము నిప్పుడీ
చీకటికొట్టుకై వెఱపుఁజెందెద నే? కడుచోద్యమయ్యెడిన్

శా॥ ఈరీతిన్ వెఱపింపఁబోలునొకో? మాహిందూసమాజంబుచే
నారాధింపఁబడున్ సతం బతుల భక్త్యాధీనమైయొద్ది? ఆ
కారాగారము, కాదు, కృష్ణజననాగారంబు దారుండనై
చేరంబంచెద నేను ధన్యుఁడనవాబ్జీ! నిన్నుఁగీర్తించెదన్

గీ॥ దాశరథి దివ్యపాదపద్మంబులాన
కల్లకా దొకవూచికపుల్ల విలువఁ
జేయఁగల అసినైన నార్జింపలేదు
కాపురంబద్దెయింట నిక్కముగమ

గీ॥ కలుగునిల్లాలి మెడను మాంగళ్యమొకటి
ఆర్షసంతతికద్ది పూజ్యంబు, దాని
జోలిపోకుండు మీకిదె కేలుమోడ్తు
జప్తుకింకేమికలదు? నిజాముపర్య!

ఉ॥ మానవనాథ! యిట్టులనుమానముసీమది నుద్భవించి, యు
గ్రానలతైక్ష్ణ్యమూనె; నుడుకారని త్వన్మ్రుధిర్ల్యపవాహమం
దే, నడియాసఁగూలి నశియించెద, రాముఁడుమిన్నకున్న; పు
ణ్యానికిఁబోవ పాపమెసురైనది; యేమనవచ్చు దుర్విధిన్.

గీ॥ కలయథార్థము దాచక తెలిపెనట్లు
కాని, కఠినాజ్ఞ నేఁడనుకంపవీడి
చెఱనుద్రోయింపఁ, దనకు శ్రీవరుఁడెదిక్క
టంచు రాఘవునిట్లు ప్రార్థించె నతఁడు.

## సింహేంద్రమధ్య-రూపకము

ప॥ నమస్కారమిదోనయ్య-ననుఁబ్రోవుమ రామయ్య ॥

అ॥ ప॥ శ్రమఁబెట్టఁగనేల? భక్త-చయమనోఽనుకూలశీల ॥న॥

చ॥ పామరమతి నతులపాప-బద్ధుఁడ రవివంశదీప!
కామితమందారా! ననుఁ-గన్న మనసుకరఁగదేర? ॥న॥

(1) అవధరించు నావిన్నప-మజ్ఞానముఁబోనడచు
భవబంధములెల్లఁద్రెంచు-పాతకముల వ్రున్నించు ॥న॥
శివకేశవతత్వనామ!-సీతాహృదయాభిరామ
ధవళయశోనిధి! దీక్షిత-దాసపాల! సుగుణజలధి ॥న॥

గీ॥ అతుల శ్రీరామదివ్యనామామృతంబు
శ్రోత లమరత్వసిద్ధి సంస్తుతి గడింప
ద్రిమ్మరించుచుఁజేరె బందిగ, మది భువి
జమునివీటికిఁబ్రాతినిధ్యమువహించు.

సీ॥ దుస్సహాజారత్వదోష నివారణో
త్సాహులై భార్యలఁ జంపువారు
ఇనుపపెట్టెలఁ జిక్కుకొని మూల్గు సిరిచెలి
విడిపించుచోఁ బట్టుపడినవారు
తతవిప్లవప్రతిష్ఠిత రాజవిద్రోహ
చింతఁ బ్రచారముల్ సేయువారు
కనుఁబ్రామి మూఁడుముక్కలయాటఁ బెరుకరి
చేతి కీలము వదల్చు జాతివారు.

గీ॥ మత్తుఁగొనఁ ద్రావి, యాంధ్రవాఙ్మయసముద్ధ
రణకు బూతునిఘంటువుల్ వ్రాయువారు
తదితర ఘోరపతితసంతతులుఁ గలిగి
కరలు నాబందిఖాన క్రిక్కిరిసియుండె.

గీ॥ అందుఁ గన్గొను మతఁడె గోపన్న మంత్రి
శేఖరి! హానిప్రతిమఁ జిత్రింపఁ గలవ?
పదములఁ గూర్చి యిటు మషీపంకమైల్య
మడఁ [illegible]నక్కట కన్నీరు విడుతు వేల?

సీ॥ లలితోర్ధ్వపుండ్రధారణఁ జేసి కలకల
లాడు మోమది యెంతో పాడువారె
పంచపింజలు వోసి బట్టఁ గట్టెడి తీరు
మట్టులాగునఁ జిక్కి మాయమయ్యె
ఉత్తరీయమ్ము యజ్ఞోపవీతము రీతి
వైచు నేర్పుపుడు జుబ్బానడంగె
నిగళశృంఖలబంధ నియతిఁ గాత్రస్థితుల
కెడబాటు లేని పాత్రుఁ డరఁగె.

గీ॥ చోడియంబలి యొకడొక్కశుద్ధిఁ జేసె
కఱకుటానేల యతనికాస్తరణ మయ్యె
వక్రగామినియగు కాలచక్రమహిమ
పరమభక్తున కింతటి పాట్లు వచ్చె.

శా॥ ఖైదీలందఱుఁగూడఁగట్టుకొని భక్తశ్రేష్ఠుఁడా రామదా
సాదిత్యాన్వయమౌళి తారకమునందాసక్తిఁగల్గించి, త
త్పాదాంభోజము వారిహృత్సరసి నిల్పన్ జాలుటన్, మోక్షవి
ద్యాదానంబు సపాత్రము య్యెనని బ్రహ్మానందముంబొందుచున్.

గీ॥ తన్ను గురుభావమునఁగొల్చుచున్నవారి
చిత్తపరివర్తనకు సంతసించి, రామ
దాసు తద్బంధితులఁగూడి దశరథాత్మ
జాత్మఁగీర్తించెఁ జెఱసాల సందడింప.

—♦ ధన్యాసి-చతురశ్రగతి ♦—

ప॥ పరాకు సేయక మమ్మేలుకోర-పరమపురుష! శ్రీరఘువీరా! ॥ప॥

అ॥ ప॥ చరాచరాత్మకప్రకృతిసంచార!-సాధుజనావన! నగధీరా! ॥ప॥

(1) మాయామానుషరూప! ధృతచాప!-మారమణా! రవికులదీపా!
ధీయుత! మృదుసల్లాప! హతపాప!-ధిక్కృతరిపుశదసాటోపా! ॥ప॥

(2) తారకనామ ? మేఘశ్యామా!-కైవలలామా! శ్రీరామా!
కారుణామృతకలిత సత్ప్రేమ-సూరిహృద్ధామ! సుగుణోద్దామా! ॥ప॥

గీ॥ రాజసేవకు లత్తఱి 'రామ' యన్న
బూతుగాఁదోఁచుచుంటఁ గ్రోధాతిరేక
మట్టివడ నొంటరిగఁజేయు నూహ, వేఱు
కొట్టమునఁబెట్ట, గోపన్న బిట్టువగచి.

చ॥ వలువురుఁగూడి నీదు భజనంబొనరింపఁగఁజూచి యోర్వరీ
చిలిపితనంబు రాజభటచిత్తములందెటుపుట్టె? నీవయిం
మలకయి ప్రోత్సహించితివ! దోసము; స్వార్థపరత్వమన్న భ
క్తులసహాయించఁబోరసుమి! కోపమ? నేనిటులాడ రాఘవా.

గీ॥ కాంచుమచ్చెస్వరంబున గంతమెత్తి
నిన్నుఁగీర్తింతు; నాపాట నీరవంబు

గాక, తన్నడ్డుకొను నెనుగాలి నైనఁ
జీల్చుకొనిపోయి, మిత్రుల చెవులఁబడును.

చ॥ అనియెలుఁగెత్తి పాడ, భటులాగ్రహ మెచ్చి, బిరాన రామదా
సు నివలకీడ్చి తెచ్చిరటు చూడుఁడు, రాక్షసకృత్య మక్కటా
కనులనుగ్రమ్ముచున్న. దధికారమదంబొకో? చబుక్కుదెబ్బలన్
తని సహించఁబాప మతఁ డల్లడె! రాముని వేడు దీనతన్,

— ముఖారి—చతురశ్రగతి —

ప॥ కన్నతండ్రి! నన్నిపుడు వీరెట్లు-గాసిఁబెట్టుచున్నారొ కనిపట్టు
అ॥ ప॥ నిన్ను గానట్టులూరకొనకురా-నిరవధిసుఖదాయక! యడ్డుపడర॥క॥
(1) శుకమద్రించికరినిఁ గాచినాఁడను-మాటబూటకం బనిపించుకొనకు
సికపూపువాడకుండ ప్రహ్లాదు-చేటుఁదీర్చినాఁడను బిరుదువిడకు॥క॥
(2) కనుము వాపీపు పెట్లె రక్తమెటు-కాల్వఁగట్టునో నీవొక్కమారు!
వినుము నా మొఱ్ఱ; నీ సాధుహస్తమున మేనునిమురవా బాధతీరఁ॥క॥

సీ॥ ఒకయింటివానిఁ జేయును నిన్ను నెడియూహ
కాకికుజన్మంబుఁ గాచినావ?
'ఆడుగొంతుకపోయి' యని యాపెనుత్రోవ
బడి, యహల్యాశాప ముడిపినావ?
ఆడుగఁడు రేవుకేవని గుహునకుఁ దర
ణోపాయ మాక్రియఁజూపినావ?
కడుపుకక్కుర్తి నక్కట యెంగిలిడదిని
మెచ్చి శబరికి మోక్షమిచ్చినావ!

అంతమాత్రము నెనరు నాయందు లేద?
కుడిచికూర్చుండలేక నా? యిడుమఁదెచ్చు
కొంటినో రామచంద్ర! నాకంటి దీను
నిట్లుపేక్షించి, శీతకన్నిడుట తగునె?

గీ॥ ద్రౌణిబాణానలజ్వాలఁ దాఁకనీక
చక్రమడ్డిడి శ్రీరామచంద్ర! తొల్లి
ఉత్తరాగర్భరక్షణోద్యోగసరణి
నభయమిచ్చినమాట సత్యంబుకాద?

మ॥ స్మృతియున్నంతకునట్లు భద్రనగవాసీ! పాహిమాం! పాహిమాం!
గతినీవే" యనియేడ్చి, మూర్ఛఁబడె, హుంకారమ్మైకమ్ముం బొందురా
జతిరస్కారము వాతఁజిక్కి యటు దాసశ్రేష్ఠుఁడవ్వాని కే
మతిమంతుం డపుడాతడైయెనిలుచు? కర్మ౯ దాట శక్యంబొకో?

చ॥ కలకుఁదనంబుతో భటునికాయము వానిని జాతినేలపై
బరబరలాగుచున్ మగుడ బందిగమందునఁ బారవైచి, కే
దారతవమైన మన్నఁగలదో యిటుచేసిన! రామదాసు క్రి
మ్మఱ స్మృతిరా రఘూత్తముని మానక బాడఁదొడంగెనీవిధిన్.

## —♦ సారమతి-మిశ్రగతి ♦—

ప॥ శ్రీరామా రామా సం-శ్రితసాపారిజాతమా ॥శ్రీ॥

అ॥ ప॥ చేరిమాటలాడ-వేరా? దాసునితోడ ॥శ్రీ॥

చ॥ కోరినావారిత్త సంపద-కారుణ్యాలవాల! తావకపద
కారసద్వయి వినా, భవసం-సారతారణకు భక్తావన ॥శ్రీ॥

(1) మారాశతాకరా!-మంజుల వాక్పూర!
పారావారగభీరా!-పలుకే బంగారా? ॥శ్రీ॥
క్రూరకర్ముఁడననియ చేర-కుంటివో రవికులోద్ధార
తారతమ్యమిట్లుఁజూపఁగఁ-దగునా? నాపై నేటికిర పగ ॥శ్రీ॥

మ॥ వసుఁగావన్ దలకొందువేని, వినుమన్నా! నీదుసత్కీర్తిఁజా
టునె? వేనోళ్ళ దిగంతరంబుల, నిరటంకంబుగా భక్తర
క్షణ మారాముని సాటిదైవతముఁ డొక్కండైన లేడంచు నీ
వనమూనింపకు, మాటఁదప్పుదువె? దేవా! రామచంద్రప్రభూ.

కం॥ అటు రాముని వేడుచు సం
కటములఁబడుచుండె, బందిఖానా, నతఁడు
ద్ఘటభక్తిఁజేయు కృషులం
దెటులైనను మోక్షమార్గమే చింతించున్.

సీ॥ రాముని నామాక్షరంబు లెల్లెక్కింపు
నేర్పుఁజూపినవచ్చు నేతలోన
ఏకాలమునలయ నీసమ్మెటన్వేయ
పాటమఁగియు నినుముపమును సెడక
పారతో నేలఁద్రవ్వఁగ నెంతలోతునఁ
దారకి రత్నంబు దారసిల్లు
పనితనంబెట్టులేర్పడ, జానకీపతి
దివ్యవిగ్రహముఁ జిత్రింప నేర్తు

గీ॥ వనుచు గోపన్న కర్మాలయమున, నివలఁ
జింతను మునుంగుఁ దాఁ బని సేయు వేళ
గాని, యమకింకర ప్రతిమాను లైన
భటుల యత్నాకులనిన నోర్వంగ లేఁడు.

గీ॥ బొండినుకలోన వేసవిమండు టెండ
కదలకటు నిల్వుమని ఘటికాత్రయంబు
ప్రభుఁడు శిక్షనువిధియింప బాధపడుచు
దాశరథి నెంచి యిటు రామదాసుఁడనియె.

## —• ఆనందభైరవి—సంకీర్ణజాత్యట •—

ప॥ నీసాటివారెవరయ్య శ్రీరామ!
నీలనీరదశ్యామ! తారకనామ!-నిరుపమబలభీమ! ॥నీ॥

అ॥ ప॥ దాసానుదాసుఁడను కాద?-నిను నే
దయాభిక్షమడుగ, నుపేక్షఁజేసె దే?-ధరణీపలలామ! ॥నీ॥

మి॥ ఆసమీర నీకన్న వేలు నా-
కాప్తులెవ్వరున్ శేరనినమ్మికొంటి నిటు

మోసమొదవఁగాసిఁబెట్టి విశ్వాసమొక నెడప
వలదని కడువేడుచుంటి. భాసురాంగ! మునిహృదబ్జభృంగ ॥నీ॥

చ॥ ఎవనికులంబునందుజనియించితి, వాయసమాయశూరుఁడీ
పలు నిజపుత్రితాపమొక బాపనిపై నెటుమాపుచుండె! నా
రవికిక నిన్ను నేర్పితివొ! రాఘవ! సికతగాఁడు నేర్పెనో!
వికటమెయుంగ; సాధుజనపీడయె మీబిరుదంబ, తెల్పుమా!

గీ॥ గాలిలో నగ్నిఖండముల్ గలిపి విసరు
క్షేత్రశైశాఖిములఁగన్న జన్మభూమి
లయ్యెనా? తండ్రి! నీనేత్రాంబుజములు
నన్ను నిల్వున దహియించుచున్నవకట.

సీ॥ పలుగుఱా నేలపైఁ బండుకొంపమటున్న
ఘాతుకమగు నల్లిపోతుబాధ
ఎలమిగోడకుఁ జేరగిలఁజూడ, పైనొవ్వఁ
గాఁగుట్టు నీమండ్రగబ్బబాధ
ఇటునటు తిరుగాడ నెంచఁ బద్మవ్యూహ
ముం బన్నిదోమలు ముసురుబాధ
వాయెత్తియుబునుపోవఁగఁ బాడుకొంటకు
బలిమినోర్మ్రయు నీభటులబాధ

గీ॥ అన్నియున్ బాధలేకదా! నన్నుఘోర!
వెఱ్ఱివానిగఁజేసి, కబీరుమోస
పుచ్చిపోయెన? అసలు రాముఁడను దైవ
ముండెనా? యుండి, మొఱవినకున్నవాఁడ?

—♦ మాండు-చతురశ్రగతి ♦—

ప॥ ఎందుడాగినావో శ్రీరామ! నా-కుందుఁదీర్పలేవో, గుణధామ! ॥ఎం॥

అ॥ప॥ సుందరాంగ! కలనైననీవునా-కందరానిఫలమామవనియెఱుఁగ ॥నె॥

(1) కనికరింపవేల? నాపైనిటు-కినుపఁబూనమేలా? భూపాల!
చనువుమీర నిటవచ్చినాపాట్లు-గనుటకైన నెడతెఱిపిలేద? నీ॥ఎం॥

గీ॥ భాగ్యశాలివి! నినురాజభటనికాయ
మడ్డపెట్టునటన్న భయంబదేల?
తరణికులదీప! బంగరు తాళము చెవి
కడకుఁదెలవదె? యెట్టిబీగమ్మునైన.

సీ॥ వేయేటికింక నా వెతఁదీర్ప నేఁడిటు
సాగిరాకున్న కౌసల్యతోడు
అభయమ్మొసంగి నన్నాదరింపవయేని
అనుజన్ముఁడైన లక్ష్మణునితోడు
అనుకంప నన్నుభద్రాద్రిని నీపదసేవ
కంపింపకున్న సీతమ్మతోడు
నినుఁగన్నులారఁగన్గొనఁగోరు నామును
చెల్లింపవేని వశిష్ఠుతోడు.

గీ॥ ఇన్నియొట్టులఁబెట్టి నీకెన్నరాని
బాధ జేకూర్చి, వీఁడపరాధియయ్యె
నంచు శేకాని, తుదకు రామయ్యతండ్రి
నీయుపేక్షకు నిన్నుఁబ్రశ్నింపలేకను.

—♦ కమాచి—చతురశ్రగతి ♦—

ప॥ కరఁగదనీమనసు, అదియింతే-కఠినత కేదినుసు? రామచంద్ర ॥క॥

అ॥ప॥ పరమపురుష! యిట్లోర్తి, నన్యథా-శరణంనాస్తి' యటన్నగుణసాంద్ర

(1) నాఁడు రావణుని చెఱజానకిపడు-గోడుఁదీర్ప నీవెటుపలవించితి
నేఁడు నేనట్టిదుస్థితినినున్న-జాడ నెఱిఁగి యేమనియూహించితి ॥క॥

(2) మాఱుపలుక క్షేమన్న? యిటునాదు-నోరునొచ్చునటు నినుఁబిల్చుచున్న
సారసాక్ష! నీవుతలఁచుకొన్నఁ-దీరదె నాయగడు ఏకనుసన్నఁ ॥క॥

శా॥ నాయాంతర్యపరీక్ష కెంతయు ననంతా! అష్టకష్టాల ని
ట్లాయాసంబును బెట్టిచూచెదవు, ఛాయాచిత్రకారుండు, తా
నాయుర్దాయము చెల్లుజీవిని పరీవాహ్రమూరత, జితేంద్రముల్
దీయంబూని యుపేక్షసేయునటు మందీభూతసాహాయ్యుఁడై

చ॥ కడచెనుద్వాదశాబ్దములకాలము; చాలదె? నీపరీక్షకీ
గడు, వలనాఁడు జానకిని, గర్భవతిన్ జననిందసైపఁ బో
కడవినిరోసి పుత్రవతియౌ పదిరెండగు నేండ్లకేక దా
కడుదయఁజెట్టఁబట్టినది క్రమ్మఱ; నన్నటులేలవా? ప్రభూ!

ఉ॥ పాయనికూర్మి నన్ను రఘువర్యుఁడు ప్రోవఁడెయంచు, సత్కృపా
తోయధి! మొండినమ్మికముతో మని యుంటిని గాని యిన్ని నా
ళ్లీయెడ; లేద, యీసరికి నెచ్చటనుంచునో! సామి! నాయభి
ప్రాయము మార్చుకొమ్మనెదవా? యిటులేటికి నాన్చి చంపుటల్.

ఉ॥ నీకథలో విశేషములనేకము, లప్పటికప్డు మెచ్చిన
శ్లోకమునట్టు లీవిని, బళే! చతురత్వముఁ జూపి, మాదృశుల్
వాకొకఁజాలనట్టి, రసవత్కవితామృతమొల్కఁబోసె, వా
ల్మీకికి లంచమిచ్చితివ? 'మేలుబళా' యన నిన్ను రాఘవా.

—♦ కాఫీ—ఖండగతి ♦—

ప॥ క్షమియింపుమా రామ-చంద్ర! పామరుఁడేను ॥క్ష॥
అ॥ ప॥ విమలమతి! నిన్నింక-విసిగింపఁగాఁబోను ॥క్ష॥
(1) నాకర్మమంచిదై-నన్ గోరి నన్నివు
పాకిరక్షింప నీ-సరికె తలఁపకఁబోవు ॥క్ష॥
(2) బిందెబంగారమిడి-నిందసేయఁగ నేల?
సందర్భమెడసి కం-సాలిబత్తునిఁజాల ॥క్ష॥

సీ॥ పలుక, విటరావు, నన్నుఁగాపాడఁబోవు
పూర్వకర్మఫలంబుతప్పునాకో? యోరి
కైనఁ దా మనుభవింపక; దానికేమి
ఒక్కవిషయము మనవి సేయుదును వినుము.

సీ॥ మానవుఁడు తనదు ప్రాణావసానమందు
దేవునదివాంఛఁజేయు, నదానికో అక్షఁ
తిరుగ బిల్కెంచునటు; అట్టితటె నవర్ధ

వసుసంతతిఁగాక, తావకపదాబ్జ
యుగళిఁజిత్తంబునిలుప నన్నో మహాత్మ!
ఆకృటికమూనిదీవించు మధమపక్షు
మింతమాత్రము సహాయమేనినెరపు
మేనుచేసిన సేవకు ఋణపడకుము.

— ♦ శ్యామాన-రూపకం ♦ —

ప॥ తల్లీ! జానకి నీకును-దయరాదా? నామీద ॥త॥

అ॥ ప॥ పిల్లలఁగని పెంచుదాని-యుల్లము కరుణార్ద్రముకద ॥త॥

మి॥ తొల్లి నీవుపడినపాట్ల-తో నేనిపుడొందునిడుమ
లెల్లఁబోల్చుకొన్న నీక-తెల్లముకాదే కర్తవ్యము? ॥త॥

(1) రామునకుఁగుండెలేదు-రమణీ! నీకుండకపో
దేమన! నరశరీరిణి-వీవాతని కగుటయొకత
మామాటయసత్యము, కుడి-యెడమ, యెడమ కుడులైనఁ
[illegible]మ [illegible]హాచర్యమహిమ-నీమగనికిఁ గలుఁగకున్నె ॥త॥

ఉ॥ దీనదనాట నీపతిని దిక్కుగ మొక్కుగ నెంచి, కష్టసం
తానముఁదీర్చిపొమ్మని తల్లిరో! వేయివిధాల నేడ్చితిఁ
గాని, రవంతయేని కొనికారముఁజూపఁడు వాఁడు; చెప్పవో
జానకి! రామచంద్రుఁడు ప్రశాంతిగనుండెడివేళఁజూచి నీ
వైనను, నాడుదానిహృదయంబతికోమలమంట వింటిఁగా
దేని, మహాత్మ నీచెఱఁగ్రహించి నశించెద నేమిసేయుదున్.

పాతకిరావణాసురుని బాధసహింపఁగనోడి ఖేచర
వ్రాతము మొఱవెట్టుకొనరాఁ బతినిద్రమునింగియుండ, నీ
వాతటి వారికష్టమునివారణనేఁ జెఱఁజిక్కియేనియుఁ
జేతునటంచు, ధైర్యమునుజెప్పిననాటి కృపారసోక్తి యా
సీతమతల్లి నామనవి సేతకుఁగారణమయ్యె నమ్మమా.

గీ॥ ఔను, మాయమ్మ సీత! మీయాలుమగలు
చదువుకొన్నార లోకపాఠశాలలోన
చాల తెలిసె; చిన్న యింటివాసాల లెక్క
పెట్టు మీబుద్ధి; నాయుసుర్గట్టుకొనుఁడు.

గీ॥ బందిఖానాను జిక్కి చావమను బ్రహ్మ
వ్రాత కేద్వను; జానకీరాములొక్క
భక్తునిడుములఁదీర్పఁ బాల్పడకపోయి
రనెడి మీభావినిందకే నడలువాఁడ.

గీ॥ ఆగతిని రామచంద్రవియోగతప్తుఁ
డగుచు గోపన్న యున్మాద మతిశయిల్ల
బందిగమ్మునఁ జిత్తవిభ్రమముఁ జెంది
పలుతెఱంగుల నొకనాఁడు కలవరించె.

—♦ అఠాణా-ఖండగతి ♦—

ప॥ నాకనులఁగట్టిన-ట్లే కానఁబడెడు నీ
యాకారమదిగో! రా-మా? నిన్ను విడువఁబోను-నీవాఁడను నేను ॥నా॥

అ॥ ప॥ పోకుపోకింకెట్లు-పోనేర్తు వొకద్వారమేక[illegible]ది[illegible]నే
నీకడ్డునిలకుందునా?-ఈతరుణము వృథాచెడఁగొట్టుకొందునా? ॥నా॥

(1) ఒకటని చేయి, యిం-కొకట నీవ్వాయి, వే
రొకట నింకొకటియై-రకరకంబులఁదోతువా?-ననుమాయఁజేతువా?
అకటా! నీవింద్రజా-లికుఁడ వంచెఱుఁగ, మా
మకరక్షణోద్యోగ్య-మిఁక నైన వహియింతువా?-నామొఱ నాలింతువా?॥నా॥

సీ॥ ఔనది నీమందహాసమా? ఒకచిన్న
వాతాయనమునుండి వచ్చు వెలుఁగు
నీదక్షిణాకరంబు కాదెయద్ది? కవాట
మువఁ జెక్కుచెదరని యినుపకమ్మి
అది నీమృదుకాంతియా! రవిబెఱపున
నిటఁదాగు కట్టికి చీకటులగుంపు

గీ॥ మున్ను నీదివ్యమూర్తి, సుత్ఫుల్లపుష్ప
సంచయముఁ గూర్చి తెచ్చి, పూజించుకొంటి
నిపుడు నీభావనామూర్తి హృదయపీఠిఁ
జేర్చి, జీవసుమాల నర్చించుకొందు.

— మంజరి-జింగళ —

ఆ తెలుంగుభక్త్యాస్వాదంబున-నవనిసురుం డల్లాడ
పొత్తువడవచ్చె నిమురయన్నాళ్ళ-కత డిసెవానితోడ
సీతాలక్ష్మణసహితుఁడై రాముఁడే తెంచి కలఁ దోఁచి
అతతప్రేమ దాసునకిట్లనె-నభయహస్తముఁ జాచి.

— శ్రీరాగము-రూపకం —

ప॥ భాగవతాగ్రణి! ననుని-పగవానిగ నెంచకుమీ
అ॥ ప॥ వేగిరపడ కర్మమనుభ-వింపక తీరునె? వినుమీ ॥భా॥
చ॥ నే గహనావాసకష్ట-నిచయంబునఁ దవిలినకథ
ఓగాములు నిజకృతక-ర్మాధీనము లనుట కెకద ॥భా॥
(1) కారాగృహమున నీపడు-కడగండ్లనుగనియు నిట్లు
లూరకుంటినని కలఁగకు-మోయి! వెల్లడింతుగుట్టు ॥భా॥
నీరీతిఫలించెఁ బూర్వ-మీవు పంజరమునఁ బెట్టి
కీరమ్మును బెంచు పాప-భారమ్మిటుఁ బూఁచిపట్టి ॥భా॥
గీ॥ భక్తమణి! నీదు దుష్కర్మఫలముడుల్లె
బంధనవిముక్తి నైపెల్లిఁ బడయఁగలవు
రాఘవున దప్పుతీర్చుభారము; నిరాశ
నడలకించుఁ దిరోహితుఁడయ్యె నంత.
సీ॥ తళుకునిగ్గుల బుటేదారి పనితనంబు
కైసేయు కుచ్చుపాగాలతోడ
బలితంపు కోదమకండలకివి లోనుండి
తేలించు వంగరఖాలతోడ

"గోపనసర్కారు" గుఱ్ఱపుజోడీయక్క-
రాలబిళ్ళల ,దవాళీలతోడ
రాచకొలంపు మర్యాదఁజెల్లించు, చెం
గావిపంచె విరుపుగట్లతోడ.

గీ॥ శాలుకోళ్ల బిగింపులఁ గటితటంబు
లొరసి యొఱఁడాగి వేల్లు ఖడ్గముతోడ
మించి, భటవృత్తిఁజేసి జీవించు నన్న
దమ్ములిద్దరు యౌవనోద్ధతులు.

ఉ॥ చక్కఁదనంబులోన, గుణసంపదయందున, రూపురేకలం
దొక్కనిఁబోడఁజాలును, మరొక్కని వేలుగఁజేసి చూడఁగా
నక్కఱయుండ, దన్నది రవంతగ చామనచాయ, వారలే
లెక్కకు నైన, నుత్తమకులీను, లపూర్వతిదివ్యతేజులుఁ.

గీ॥ ద్వారపాలురనంపి, నవాబనుజ్ఞ
వడసి, యుద్యోగముఁజేరి, బత్తెమ్ము, స
లాములొనరింప, చేఁజబ్బురమున వారి
గాంచి, ప్రశ్నించెఁదగురీతి గౌరవించి.

## మలయమారుతం-రూపకము

ప॥ ఏదేశమువారు మీర-లిటకేటికి వచ్చినారు
అ॥ ప॥ సోదరులా? భటవృత్తి మి-మ్మాదరింతు, తెల్పుడారు ॥ఏ॥

రా. ల:-(1) రామదాసభటులము, భ-ద్రాచలవాసులము మేము
రామోజీ! లక్ష్మోజీ!-నామంబుల నెగడినాము ॥రా॥

తా:— (2) పైసకుగతిలేని బోడి-బాపని సేవకుల మీరు?
మాసమక్షమునందు రుఝాటా-మాటలాడుచున్నా ॥ఏ॥

రా. ల:-(3) నమ్మఁదతని యింట, నూడి-గమ్మొనర్పఁగోరి మేము
సొమ్మునకుఁ గాదు, ప్రసా-దమ్మునకే కుదిరినాము ॥రా॥

తా:— (4) అంగిలిలేకుండమ్రింగె-నాబులక్షలు మాఖజాన
దొంగవాడు; వానిభటుల-కుంగల నేర్పెందులోన ॥నే॥

రా. ల:-(5) దాపరీడుకాడు, భాగవ-తాగ్రగణ్యుఁడతఁడు చూడు
కాపట్యమెఱుంగఁబోడు-భూపతీ! కడుమంచివాఁడు ॥రా॥

తా:— (6) పొగిడిననేమయ్యె? ముక్తి-బొందునె? వాఁడందుచాక
సుగపడు యోగమెదిలేక-చూపించెద నామజాక ॥ఏ॥

రా. ల:-(7) అప్పుఁదీర్చి యొడయనిచెఱ-దప్పించెద మిపుడె నమ్మి
చప్పునసెంచుకొని రక్షి-దిప్పింపుము: యిదిగో సొమ్మి ॥రా॥

ఉ॥ కన్నకుమారులతో సమముగా మముఁబెంచె, జవానులన్న మా
టెన్నఁడులేక; నీతఁడట కీడ్గడగా దయ సేయకున్న, మా
కన్నులలో దరిద్రత మకా మొనరింపదె? పూజ్యుఁడట్టి గో
పన్నక? యిట్టికష్టము నృపా! విపరీతము కాదె? దైవము౯.

ఉ॥ తింటిమివానియుప్పు, తరితీపువహించిన నుండఁబోరు మా
వంటికృతఘ్నులిట్టితతి; వంశమునిల్చునె? మాకు నెట్టి యిం
టింటను, నూరనూరఁగడ కెట్టులొ గోపనయప్పుఁదీర్పలే
కుంటిమి; ద్వాదశాబ్దములకున్ ఫలియించెను పూర్వశ్రమంబుల౯

గీ॥ భూతవైద్యాన కొంతసొమ్మునుగడించి
మాకుసాహాయ్యపడె "హనుమంతరావు
పంతు"లను భక్తుఁడొకఁడు, గోపనకునుంగు
చెల్మికాఁడును భద్రాద్రిసీమవాఁడు.

మ॥ అనుచున్నంతనె మాయమయ్యెను సదస్యానీక, మాయోలగ
మ్మునఁ జేడొక్కఁడె జాగ్రత౯ గలఁడు, నమ్మండొక్క స్త్రీ [వ్యక్తి, తాఁ
గనుల౯ దోఁచి,యదృశ్యమయ్యెనె!తటితాంతి౯ బురాణించు, దా
ధనమాల్లక్ష్మి దెట్టువచ్చెనటు, నంతా వింతగా నొప్పఁగ౯.

గీ॥ వింతలోవింతకాదె? పృథ్వీవిభుండు
పూర్వజన్మపుసంస్మృతిఁబొంది వేగ

గన్నడిగివచ్చి రామోజి మునుబడుగు
దమ్ములక్ష్రాలియిట్లు ప్రార్థనమొనర్చె.

— చక్రవాకము-మిశ్రగతి —

ప॥ పరమపావనారామ!-భద్రగిరధామ! త్రిజగత్సార్వభౌమ ॥ప॥

అ॥ ప॥ శరణుతారకనామ!-జనకజాభిరామ! పాతకవిరామ ॥ప॥

చ॥ కరుణాకర! తొల్లింటి నాపూర్వకర్మమిన్నినాళ్ళకుఁ దీరెనా?
వరదాయక! తావకదర్శన-భాగ్యమహా హా! నేటికిఁజేకూరెనా? ॥ప॥

సీ॥ సందియమేమి? నిశ్చయము, తండ్రీ! నేను
పూర్వభవంబున భూమిసురుఁడ
కాశికాపురి కురంగట నొక్క-దివ్యలిం
గార్చన, నింద్రపదానుభవముఁ
గోరి చేసితిఁగాని, కొఱవడి తాలిమి
జలభాండమొండు విసరితి లింగ
మౌళి, నెన్నాళ్ళకుమాపతి దర్శన
భాగ్యలేశమ్ము చేపడమి వినిని.

గీ॥ శంకరుండట్టి శిక్ష సాక్షాత్కరించి
కనికరంబుట్టిపడఁగ నిట్లనియె నీవు
పడ్డశ్రమమెల్ల వేగిరపాటుకతన
బూదిఁబోసిన పన్నీరుపోల్కిఁజెడియు.

— మంజరి-నాయకి —

సకింద్రపదవి దుర్లభమిఁక తా-నీపావై ధరమీద
గొండుపూడిగము పలువురచేఁగలిమి, బలిమి, మరియూర
మ్లేచ్ఛజన్మకు నీమదుతన-మ్మేకతము; నన్నుఁగనుట
పాంచాభవయ్యు గోబ్రాహ్మణ-సద్భక్తి మెలఁగఁగంటమట.

గీ॥ కోరి, నిర్భాగ్యముఁ జెప్పుకొన్న, మూర్ఖ
తకువగలి, బాష్పధారఁ బాదములఁగడిగి

దేవ! భవతారణమ్మ నాకేవిధమ్ము
కలుగఁగలదనివేఁడ, ముక్కంటిపలికె.

ఉ॥ „కర్మకువశ్యులెవ్వఁగనుగాని, కలంగకుమోయి! వత్స! నీ
కర్మిలి రామదర్శనమహావిభవంబు లభించు, ధాత్రి నీ
ధర్మమునిర్వహించుమనెడఁ దానఁదరింతు"వటంచుఁజెల్ప నీ
మర్మమెఱుంగఁగంటిని రఘూధవ! నాపరితాపమార్పవే?

కం॥ అనవినిరామోజీ „యో
జనవర! జన్మాంతమందు సాయుజ్యంబుల్
గన్నెద్దీవు మత్కృపామహి
మను, ధారుణినేలుచుండుమా" యనునంతన్,

గీ॥ స్వప్నమటుతోఁచెనంతయు క్షణములోన
మాయక్రమ్మట నెప్పటిమాదిరి యయి
ఆరులక్షలధనముఁ దానందుకొని, న
వాబొసంగె రశీదు గోపనభటులకు.

గీ॥ సంభ్రమానందపారవశ్యములఁగూర్ప
రామదాసునుజేరి సర్కారుబంట్లు
బంధములడుల్చి యతని భూపాలసముఖ
మునకుఁగొనివచ్చి రందలమ్ముపయి, నపుడు.

శా॥ తానీషాయెదురేగి దాసుని సమీదృత్ప్రేమ నాశ్లేషణా
నూనప్రక్రియగౌరవించి, కడుసంతోషమ్ముతో గద్దెనా
సీనున్ జేసి, మృదూక్తిఁబల్కెఁగుణరాశీ! తప్పుమన్నించు మ
జ్ఞానప్రేరణ సాధుపూరుషుని రోసమ్మూని కారించితిన్.

## —♦ దేవగాంధారి-రూపకం ♦—

ప॥ అన్నా! నాపాపమెన్నఁ-నలవియె? రాజసముతోడ ॥న॥
అ॥ ప॥ పన్నెండేండ్లటు నిను చెఱ-బాధల నలయించినాఁడ ॥న॥
(1) అపరాధిని పిదుసత్కా-ర్యాచరణ నెఱుంగనైతి
కృపేణుఁడనై ధన మె కీర్తి-కిన్ గతియని మోసపోతి ॥న॥

(2) మనయిరువురిహితుఁడు రాముఁడని నీవువచింపనాఁడు
వినవైతివి తద్యథార్థ-మును గ్రహించుకొంటినే ॥డ॥

సీ॥ రామోజి లక్ష్మోజి నామధేయులు, నిన్ను
నమ్మినబంట్లు ధనంబొసంగి
కొనిరిరసీదు, నాకనుగవ మిరుమిట్లు
గొలుప విద్యుల్లతవలె మిటారి
యొకతె కాన్పడి దిచ్చమొకమయ్యెనంతలో
నదియేమి దైవమాయయో యెఱుంగ
నల్లాను మఱపించె నల్లనిరామోజి
జ్ఞప్తిలేదాపైన జరిగినపని,

గీ॥ కాని నాపాలి, పాదరత్నములను ముల్లె
గ్రోవుచెంగటనుంట యబ్బురముకాదె?
రామభక్తశిఖామణీ! నీమహత్వ
మరయఁజాలక నేను పామరుఁడనైతి.

ఉ॥ శ్రీరఘురామభక్తకులశేఖర! భద్రనగంబునీకు జా
గీరుగవ్రాసియిచ్చితి సుఖింపుము; చైత్రమహోత్సవంబు మా
పేరనొసర్పుమీ, వలయుపెన్నిధినంపుచునుందు, మెప్పుడీ
తూరిమివృద్ధినొందమనకున్ జగదీశ్వరుఁడోము గావుతన్.

—◆ ద్విపద ◆—

అనవిని, యేలిక-యడుగులవ్రాలి
వినయమ్మెఱయ గో-పనభక్తిఁదూలి

—◆ సురట-చతురశ్రగతి ◆—

ప॥ ధన్యుఁడనైతివి తానీషా! రామ-దర్శనమ్మున బహుజనపోషా ॥ధ॥
అ॥ మాన్యచరిత! నీపూర్వపుణ్యమస-మానమహహా! మృదుతరభాషా ॥ధ
రామోజీకాఁడతఁడు, విను, దాశ-రథి; లక్ష్మోజీనామమునఁ జెల్లె
సౌమిత్రి; నీదు కనులభ్రమముంచు-చానని కమ్ముగ సీతమ్మతల్లి ॥ధ

(2) కడకుఁ ద్వత్పాదరజోలేశమున-కైన నీడురానేర్తునో కో! నేను
పుడమి లేఁడ! నన్నుగ్గడింప కీ-పాగడ్త కింతయును నర్హుఁడనుగాను ॥భ

ఉ॥ ఎన్నఁడు నాతపంబుఫలియించి, రఘూత్తము దివ్యమూర్తి నా
కన్నులకర్వ్వతీరఁ గనఁగల్గు నదృష్టముఁజూఁగొందునో
పున్నెపుఁబోవ! నన్నోతలమంచితినంచు దపింపఁబోకు, మే
మన్న, విధిన్ జయింపఁగలమా? సెలవీయుము పోయివచ్చెదన్.

చ॥ అనుచునవాబు నెంతొ కొనియాడి, బహూకృతులంది, వేడ్కన్‌భ
ద్రినగముఁజేరి, పౌరగణరంజనముంబొనరించి, యాలయ
మ్మునకుఁబిఱుంద నాత్మసతి, పుత్రుఁడు రాఁజని తన్మయత్వమున్
గని వినుతించె రామపదకంజములన్ నుదరాన మొ్రక్కుచున్.

## ——♦ కేదార-చతురశ్రగతి ♦——

ప॥ కనికరమున ననుగాచెడిదేవుఁడ-వని నెఱనమ్మితిరా, రఘువీరా ॥క॥

అ॥ప॥ మనసిజరూప! నే మునుసలిపినపాప- మనుభవించితిగద రా-శుత్రి
[సంచార ॥క॥

(1) కల్లజగము నాకమితానందముఁ-గలిగించునెయన్న? మేలగు నెచెఱకన్న
నొల్లనొల్లనీపద సాన్నిధ్యము-నొసఁగ(పోవవేల? దీక్షితపరిపాల ॥క॥

సీ॥ మాట తేటకు మాఱుమనువగు పరుషవా
గ్గడిమి నన్ లేఁడు వాయడఁచునాఁడు
తృష్ణచల్లారఁ గవోష్ణరక్తముఁ(గ్రోల
నెంచి నన్ ఘటులుహింసించునాఁడు
క్రిమికీటకాదు, లుత్కృష్టమానవజన్మ
మలఁతిగా నాగుండెఁదొలచునాఁడు
వైద్యసహాయమావంతయులేక నే
నామయంబులఁజిక్కి-యడలునాఁడు.

గీ॥ నన్ను వేఁగాచుకొనుదారి తెన్నుఁగనక
'పాహిమాం! పాహి!' యని స్వార్థపరుఁడనగుచు
నిన్నుశ్రమపెట్టినాఁడ, మన్నించు మిపుడు
రమ్యగుణసాంద్ర! మాయయ్య రామచంద్ర!

కం॥ ఆరీతిఁ గొంతకాలము
శ్రీరామునిసేవఁజేసి చేరె వైకుంఠం
బారామదాసు భక్తిన్
తారకము జపించుకొంచు దాశరథికృపన్.

## మంగళహారతి

—♦ సురట-ఖండగతి ♦—

ప॥ జయమంగళం రామచంద్రాయ, సుగుణవి-స్తారాయ-ధీరాయ జయ మంగళమ్ ॥జ॥

ప॥ జయమంగళం యశ-శ్చంద్రికానికరాయ, జానకీనాథాయ జయ మంగళమ్ ॥జ॥

(1) రవివంశకలశాబ్ధి-రాకాశశాంకాయ- రాజీవనేత్రాయ - జయమంగళమ్ ॥జ॥

భవపాశనాశాయ - భక్తవ్రజేశాయ - పట్టాభిరామాయ జయమంగళమ్ ॥జ॥

శ్రీరాజగోపాలార్పణమస్తు.

ఉ॥ బాలుఁడు దీక్షితాఖ్యుఁడతిభక్తి మెయిన్ రచియించి, రాజగో
పాలునకంకితంబిడె, కృపాపరిపూర్ణముతో తదీయ దృ
గ్జాలములూతగా భయదసంసరణోదధిఁదాటు; నీతివి
ద్యాలయమైన యీచ్చరితమార్యుల సమ్మతమున్ గడించుతన్.




కం॥ భద్రగతి నచ్చుపని నే
ఛిద్రములోదవనటు సల్పు సీతారామా
ముద్రణశాలాధిపులు
న్నిద్రయశస్స్ఫురులు కీర్తనీయులు నాకున్.

# శోధన పత్రము.



| పుట | పంక్తి | అసాధువు | సాధువు |
|---|---|---|---|
| 4 | 3 | మమమలం | విమలం |
| 6 | 24 | త్వత్కృపా | మీకృపా |
| 8 | 12 | ఝురి | ఝరి |
| 10 | 4 | పేరిడి | పేరి |
| 13 | 10 | వీవు | వీపు |
| 14 | 6 | ఫలించి | ఫలియించి |
| 15 | 9 | నిష్ట | నిష్ఠ |
| ,, | 14 | వినమ్ృఁడై | వినమ్రుఁడై |
| 20 | 25 | విద్యాదిను | విద్యయను నొక్కఁడి |
| 23 | 17 | బళవారి | బిళహారి |
| ,, | 21 | క్రీ | కీర్తి |
| 25 | 23 | నీదప | నీపద |
| 27 | 3 | మిరుహాముల | మిరుహామ్ముల |
| 35 | 13 | వహించి | వహియించి |
| 38 | 12 | రామా | రమా |
| 42 | 5 | రామా | రామ |
| 50 | 9 | జాత్మ | జాతు |
| ,, | 13 | పాత | పాప |
| 50 | 26 | గిర్రింత | గీర్రింతు |
| 52 | 15 | శ్రితసా | శ్రిత |
| 57 | 25 | దైర్యము | ధైర్యము |
| ,, | ,, | యె | యే |

కొన్నిచోట్ల (ఁ) పొల్లునకుమారు (ఁ) పొల్లు పడినది. ఇంకా తెలియకున్న క్షమింతురుగాక.

